

# కొడుకు పెళ్ళి!

అది 1906. ఆ ఏడాది జూన్‌లో దక్షిణాఫ్రికాలో జులూ తిరుగుబాటు పెల్లుబికింది. ప్రభుత్వానికి మద్దతుగా ఇండియన్ అంబులన్స్ కార్ప్సుకు సారథ్యం వహించాలని గాంధీ నిర్ణయించుకున్నారు. అందుకే ఆయన తన కుటుంబాన్ని డర్బన్‌నుంచి ఫినిక్స్‌కు తరలించి అక్కడ స్థిరపడ్డారు. ఫినిక్స్‌లో పాముల సంచారమెక్కువ. అక్కడి నుంచి రెండు మైళ్ళ దూరంలో ఉన్న రైల్వేస్టేషన్ ప్రాంతానికి వస్తే తప్ప నాగరికత గల కుటుంబాలు కనిపిస్తాయి. అంటే ఈ ఫినిక్స్ ఎలాంటి ప్రాంతమో ఆలోచించండి. కస్తూరిబాకు ఆరోగ్యం అంతగా బాగు లేదు.

మరో వైపు గాంధీ బ్రహ్మచర్యవ్రతం పాటించడానికి నిర్ణయించారు. ఈ విషయాన్ని చెప్పినప్పుడు కూడా కస్తూర్బా ఎలాంటి అభ్యంతరమూ చెప్పలేదు. గాంధీజీ జీవితచరిత్రలు రాసిన వాళ్ళు కొందరు ఈ విషయాన్ని చెప్తూ కస్తూరిబాకు మరో ప్రత్యామ్నాయం లేకుండా పోయిందన్నారు. భర్తతో వాదించడడం వల్ల ఎలాంటి ప్రయోజనం లేదని ఆమె గ్రహించారన్నారు. చాలా మంది హైందవ స్త్రీలలాగే ఆమె ఎంతో విధేయురాలిగా వ్యవహరించారు.

కస్తూర్బాకు ఎదురైనట్టే టాల్‌స్టాయ్ భార్యకు కూడా తన భర్త నుంచి ఇటువంటి ప్రకటనే వెలువడినప్పుడు ఆమె ప్రాణత్యాగం చేస్తానని బెదిరించింది. భర్త భావాలను అంతగా ప్రశంసించని ఆమె వాటి అమలుకుకూడా పెద్దగా ఆసక్తి చూపలేదు. మరోవైపు, కస్తూరిబా అచ్చమైన భారతీయ భార్యలా భర్త అడుగుజాడల్నే అనుసరించింది. తన అభిప్రాయానికి భిన్నంగా ఏది చోటుచేసుకున్నా దానికి ఆమె అభ్యంతరం చెప్పలేదు.

# సాదాసీదా ఆహారం!

ఫినిక్స్‌లో ఉన్నప్పుడు కస్తూరిబాకు ఓ తీపికబురు అందింది. హరిలాల్, గులాబ్ రాక, గులాబ్ కడుపుతో ఉందన్న విషయాలు తెలిసి ఆమె సంబరపడ్డారు. కస్తూరిబాకు రుచికరమైన వంటకాలు తయరు చేసి అందరకీ వడ్డించి తాను తినడానికి సిద్ధపడుతున్న వేళ జోహాన్నెస్‌బర్గ్ నుంచి ఓ టెలిగ్రాం వచ్చింది. గాంధీజీని అరెస్టు చేసి రెండు నెలల జైలు శిక్ష విధించినట్టు ఆ టెలిగ్రామ్ సారాంశం. ఆమె వెంటనే కంచెం తీసేసింది. జైలులో తన భర్త ఉన్నంత కాలం ఆయన ఏం తింటారో అలాంటి సాదాసీదా ఆహారమే తానూ తింటానని చెప్పారు. గాంధీజీ బందీగా జైలు జీవితం గడిపి బయటికొచ్చేవరకు ఆమె అందిర పట్ల చూప్ని ఔదార్యం, అప్యాయతానురాగాలు అందరినీ ఆకట్టుకున్నాయి. ప్రతి ఒక్కరూ ముగ్ధులయ్యారు.

చదువుకోకపోతేనేం, ఆమె జమాపద్దు లెక్కల్ని కచ్చితంగా చూస్తూ వచ్చారు. లెక్కల్లో ఎక్కడా వీసమెత్తు తేడా వచ్చేది కాదు. ఆమె క్రమశిక్షణతో నడచుకుంటూ త్వరలోనే అందరికీ 'అమ్మ' అయ్యారు. ఆమెను "అమ్మా" అని "బా" అని పిలిచే వారు.

– యామిజాల జగదీశ్ – హైద్రాబాద్

# యాంటీ బయోటిక్స్ అనవసరం !

ఆరోగ్యం కుదుటపడిన తర్వాత యాంటీ బయోటిక్స్‌ను వాడటం శుద్ధ దండగంటున్నారు ఆక్స్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయ నిపుణులు. పైగా వీటివల్ల శరీరంలో ఔషధ నిరోధకత పెరిగే ముప్పు లేకపోలేదట.

డా. టిమ్ పీటో బృందం, వ్యాధి నిరోధక ఔషధాలు తీసుకుంటున్న కొందరిని క్షుణ్ణంగా పరిశీలించి ఈ విషయాన్ని రూఢీ పరిచింది. వ్యాధి తగ్గకముందే యాంటీ బయోటిక్స్ వాడకాన్ని నిలిపివేయటంవల్ల రోగనిరోధక శక్తి పెరుగుతుందని రుజువు లేదు. కానీ ఆరోగ్యం కుదుటపడిన తర్వాత ఇక ఆ ఔషధాల అవసరం లేదనిమాత్రం గుర్తించాం. వీటిని అవసరమైనమేరకో వాడటం ద్వారా శరీరంలోని సహజ వ్యాధి నిరోధకశక్తిని కాపాడుకోగలుగుతాం అని పరిశోధకులు తెలిపారు.

# పక్షవాత బాధితుల నడకకు దన్ను !

పక్షవాత బాధితులకు శుభవార్త! పక్షవాతం కారణంగా కోల్పోయిన సాధారణ నడకరీతిని తిరిగి పొందడంలో ఉపయోగపడే సరికొత్త రోబోటిక్ చీలమండ సహాయకారిని శాస్త్రవేత్తలు అభివృద్ధి చేశారు. సాధారణంగా పక్షవాతం అనంతరం ఎనభై శాతం మంది బాధితుల్లో ఒక కాలు సాధారణ పని తీరు సామర్థ్యాన్ని కోల్పోతుంది. దీన్ని వైద్య పరిభాషలో హెమిపరెసిస్‌గా పిలుస్తారు. కొందరు లేచి నడవగలిగినా గతంతో పోలిస్తే నడకరీతిలో మార్పు ఉంటుంది. ఈ ప్రతికూలతను అధిగమించడంలో దోహదపడేందుకు గాను హార్వర్డ్ విశ్వవిద్యాలయ పరిశోధకులు తాజాగా ఓ రోబోటిక్ చీలమండ సహాయకారిని అభివృద్ధి చేశారు.

ప్రస్తుతం అందుబాటులో ఉన్న ప్లాస్టిక్ చీలమండ సహాయక పరికరాలకు భిన్నంగా తాజా పరికరం అత్యంత తేలికగా, మెత్తగా ఉంటుంది. దీన్ని ధరించిన పక్షవాత బాధితులు ఎలాంటి ఇబ్బంది లేకుండా నడుస్తున్నారని గత సాధారణ నడకరీతిని తిరిగి పొందగలుగుతున్నారని శాస్త్రవేత్తలు వెల్లడించారు.

# త్రీడీ నమూనాల సృష్టి !

ద్విమితీయ (2డీ) ఛాయాచిత్రాల నుంచి త్రిమితీయ (3డీ) నమూనాలను సృష్టించగల కృత్రిమ మేధస్సు వ్యవస్థను శాస్త్రవేత్తలు తాజాగా అభివృద్ధి చేశారు. సర్ఫ్ నెట్‌గా పిలుస్తున్న ఈ సరికొత్త ఏఐ సాఫ్ట్‌వేర్ రూపకల్పనలో భారత సంతతి శాస్త్రవేత్తలు కార్తిక్ రమణికూడా పాలు పంచుకున్నారు. అమెరికాలోని పర్డ్యూ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడిగా ఆయన ప్రస్తుతం విధులు నిర్వర్తిస్తున్నారు. కొన్ని వందలాది వస్తువుల ఆకారలను తొలుత చూపించి అనంతరం వాటి 2డీ చిత్రాలను అందజేస్తే సంబంధిత వస్తువుల 3డీ నమూనాలను ఈ సాఫ్ట్‌వేర్ పునఃసృష్టిస్తుందని రమణి వివరించారు.

- మల్లంపల్లి ఇంద్రాణి, చెన్నై





ఎడిటర్ & పబ్లిషర్ : జి.ఏ.రావు

గౌరవ సంపాదకుడు & పబ్లిషర్ : జి.ఎ.రావు

సంపాదకుడు : యామిజాల జగదీష్


## దీపోత్సవం !

పిల్లలూ! ఆశ్వయుజ మాసంలో కృష్ణ అమావాస్య రోజు జరుపుకునే పండుగ దీపావళి. చిన్నా పెద్దా ధనిక పేద అనే తారతమ్యం లేకుండా ఎవరి స్థోమతను బట్టి వారు ఈ పండుగను జరుపుకుంటారు. దీపమాలికలతో లక్ష్మికి నీరాజమిచ్చే రోజు కావడంతో దీనికి దీపావళి అనే పేరు వచ్చింది. నరకలోకవాసులకై దీప, ఆవళి కల్పించే రోజు కాబట్టి దీనికి దీపావళి అనే పేరు వచ్చింది. రాక్షస రాజైన బలి చక్రవర్తి పాతాళానికి విష్ణువుతో అణగద్రొక్కబడిన రోజు కావడంతో ఇది ఒక మహెూత్సవ దినంగా కూడా పరిగణించబడుతోంది. శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన రోజు కనుక ఈ రోజును ఓ మహెూత్సవంలా జరుపుకోవడమూ వాడుకలో ఉంది. అలాగే విక్రమ శక స్థాపకుడైన విక్రమార్క చక్రవర్తి పట్టాభిషేకం పొందిన రోజు కూడా ఇదే కావడం విశేషం. ఇలా ఇన్ని రకాలుగా పర్వదినమైన ఈ దీపావళి పండుగతో వాడవాడలూ దేదీప్యమానంగా జిగేలుమని కాంతిమయమవుతుందని వేరేగా చెప్పక్కర్లేదు. పిల్లలు పెద్దల సమక్షంలో బాణాసంచా కాల్చుకోవడం ఎంతైనా శ్రేయస్సు. ఏ మాత్రం అజాగర్తగా ఉన్నా ప్రమాదాలు జరిగే అవకాశముంది కనుక అన్ని విధాల అప్రమత్తంగా ఉండి ఈ పండుగను చేసుకుని ఆనందం పొందాలని మీ బుజ్జాయి సంపాదకవర్గం కోరుకుంటోంది.


సంపుటి : 43 October - 2017 సంచిక : 5

విడిప్రతి వెల : 15.00 సం॥ చందా రూ. 180.00

## మితంగా మద్యపానం ...దూరంగా మధుమేహం !

మద్యం అస్సలు ముట్టనివారి కంటే వారంలో మూడు నాలుగు రోజులు పరిమిత మోతాదులో మందు తాగేవారికి మధుమేహం వచ్చే ముప్పు తక్కువని తాజా అధ్యయనమొకటి చెబుతోంది. దక్షిణ డెన్మార్క్ విశ్వవిద్యాలయానికి చెందిన శాస్త్రవేత్తలు మధుమేహం తరచూ మందు పుచ్చుకునే అలవాటు ప్రభావంపై సర్వే చేపట్టారు. 70,551 మంది మద్యం అలవాట్లను కొన్నేళ్ళపాటు పరిశీలించారు. తర్వాత్తర్వాత వీరిలో 1746 మంది మధుమేహానికి గురయ్యారు. అసలు మద్యం జోలికి పోనివారికంటే 142 మిల్లీలీటర్ల చొప్పున వారంలో 14 సార్లు వైన్ తీసుకునే పురుషులకు మధుమేహం వచ్చే ముప్పు నలబై మూడు శాతం తక్కువని గుర్తించాం. వైన్‌లో ఉండే పోలిఫెనాల్స్ రక్తంలోని గ్లూకోజ్ సమతుల్యతను పరిరక్షిస్తుండడమే ఇందుకు కారణమని భావిస్తున్నాం అని అధ్యయనకర్తలు తెలిపారు. ఎక్కువ మోతాదులో మద్యం సేవిస్తే మాత్రం మధుమేహం వచ్చే ముప్పు చాలా అధికంగా ఉంటుందని వారు హెచ్చరిస్తున్నారు.

## విశ్వంలో వ్యోమగాముల కోసం సరికొత్త ఆవాసం !

పరిశోధనల్లో భాగంగా విశ్వాంతరాళాల్లోకి వెళ్ళే నాసా వ్యోమగాములకు దోహదపడేందుకు గాను సరికొత్త అవాసం సిద్ధం కానుంది. సుదూర విశ్వంలో ఈ స్థావరాన్ని ఏర్పాటు చేసే దిశగా అమెరికాకు చెందిన లాక్ హీడ్ మార్టిన్ అనే ఖగోళ అధ్యయన సంస్థ అడుగులు వేస్తోంది. అంతర్జాతీయ అంతరిక్ష కేంద్రానికి సరకులను చేరవేయడంలో ఉపయోగించిన ఓ పాత కార్గో కంటెయినర్‌ను పునరుద్ధరించడం ద్వారా కెన్నడీ అంతరిక్ష పరిశోధన కేంద్రంలో తాజా ఆవాస నమూనాను శాస్త్రవేత్తలు సిద్ధం చేస్తున్నారు. వ్యోమగాములను సురక్షితంగా ఉంచేందుకు మానవరహిత వ్యోమనౌకలను నియంత్రించేందుకు అవసరమైన సాంకేతికతలను ఈ నమూనాలో పొందుపరుస్తారు. సుదూర విశ్వంలో ఆవాసాల అభివృద్ధిపై పరిశోధనలకుగాను నాసా ఇటీవలే లాక్‌హీడ్ మార్టిన్ సంస్థతో ఒప్పందం కుదుర్చుకున్నది కూడా.

## ఆచార్య కె.ఎస్. కృష్ణకు జాతీయ ప్రతిభా అవార్డు

ఆంధ్ర విశ్వవిద్యాలయ పూర్వ విద్యార్థి, తెలంగాణలోని హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో భూమి అంతరిక్ష శాస్త్రాల కేంద్రంలో ఆచార్యునిగా పనిచేస్తున్న ఆచార్య కె.ఎస్. కృష్ణ ప్రతిష్ఠాత్మకమైన జాతీయ ప్రతిభా అవార్డును అందుకున్నారు. భూశాస్త్ర మంత్రిత్వ శాఖ ఆవిర్భావ దినోత్సవం సందర్భంగా ఢిల్లీలోని విజ్ఞాన్ భవన్‌లో జరిగిన కార్యక్రమంలో ఆయనకు ఈ అవార్డు అందజేశారు. ఆయన 1984లో గోవాలోని సముద్ర అధ్యయన జాతీయ సంస్థలో శాస్త్రవేత్తగా ఉద్యోగ బాధ్యతలు స్వీకరించి ముఖ్య శాస్త్రవేత్తస్థాయికి ఎదిగారు. హెచ్‌సీయూ ఆహ్వానం మేరకు ఆయన ఆచార్యునిగా పదవీబాధ్యతలు స్వీకరించారు.



- అంబడిపూడి శర్వాణి శరత్ సుబ్రహ్మణ్యం, గుంటూరు



# అపాత్ర దానం !

దానయ్య సార్థక నామధేయుడనిపించుకో వాలని తాపత్రయపడే వ్యక్తి. అడిగినవాడికీ- అడగనివాడికీ దానం చేయడమే తన హాబీగా ఎంచుకొని వూర్లో అందరిచేత దానకర్ణుడని - ధర్మప్రభువని పిలిపించుకుంటూ తెగ సంబర పడిపోయేవాడు.

అతనిదో చిన్నపాటి చింతలులేని కుటుంబం. ఒక్కడే కొడుకు పేరు సిద్ధార్థుడు. అతను పెరిగే కొద్దీ ఏ సంపాదన లేని తన తండ్రి చేస్తున్న దాన ధర్మాలవలన తమ తాతలు సంపాదించిన సొత్తు తరిగిపోతున్నాయన్న విషయం అర్థమై పోయింది. తన తండ్రికెలా తెలియచెప్పాలో తెలియక, తన తండ్రికి స్నేహితుడైన సుధాకర్ గారిని కలిసాడు.

"అయ్యా! నన్ను మన్నించండి. మీతో ఈ విషయం విన్నవించుకున్నందుకు. మా తండ్రి గారిలా దాన- ధర్మం చేస్తూ ఆస్తిని హారతి కర్పూ రంలా హరింపజేస్తుంటే, ఇక నాకూ నా వంశీ యులకు మిగిలేది ఏముంటుంది? కొండంత అప్పు తప్ప." అని చెప్పటం ఆపి అతనివైపు సాలోచనగా చూశాడు.

"అవును సిద్ధూ! నాకు అలానే అనిపిస్తుంది. అతనిచేత ఈ అలవాటు మాన్పించడం ఎలానా అని యోచిస్తున్నా! అదీకాక అతనికున్న ఈ బలహీనమైన దురలవాటువల్ల మన వూళ్లో సగానికి పైగా బిచ్చగాళ్లుగానూ, సోమరిపోతుల లాగాను తయారైనారు వాళ్లు. శ్రమచేసి సంపా దించుకోవాలన్న సంగతే మరిచిపోయారు. ఇక



అదే మార్గంలో వారి తదుపరి సంతతికూడా నడిస్తే, వూరంతా సోమరిపోతుల నిలయమై పోతుందని వాపోయాడు.

"అదీ నిజమేనయ్యా అవసరానికి దానం చేయడం సబబే, సమంజసమే- కానీ ఇలా కష్టించి పనిచేయగల సమర్థవంతులుకూడా పరాన్న బుక్కులుగా మారే ప్రమాద మెంతైనా వుందని విచారించాడు.

"సరే సిద్ధూ మీ నాన్నకు బుద్ధి ఎలా చెప్పాలో నేను కాస్త యోచనచేసి చెపుతాను- నాకు కొంచెం సమయం కావాలి.." అని సర్దిచెప్పాడు సిద్ధూని.

వారం రోజుల తర్వాత సిద్ధూ తన తండ్రి దానయ్యను తీర్థయాత్ర నిమిత్తమై ఉత్తర భారత యాత్రకు బయలుదేరదీశాడు. తనకుకూడా వయసుమీద పడుతున్న దృష్ట్యా మరోమాట బదులు చెప్పకుండా సిద్ధూ సాయంతో సిద్ధమయ్యాడు దానయ్య. అదీకాక, అయిదేళ్ళ క్రితం అనారోగ్యంతో కాలంచేసిన భార్య కనకవల్లికి కాశీ-ప్రయాగలలో పిండప్రదాన కార్యక్రమాలు కూడా నిర్వర్తించే విధికూడా పూర్తిచేసుకోవచ్చని అభిప్రాయపడ్డాడు.

ఆవిధంగా దానయ్య తన కొడుకు సిద్ధూతో తీర్థయాత్రలకు బయలుదేరాడు. తన మిత్రుడు సుధాకర్ దగ్గర సెలవు తీసుకుని, తిరిగి ఎప్పుడు వచ్చేది అనే విషయాన్నికూడా బయట పెట్టకుండా!

దానయ్య ఊరు వెళ్ళిన మూడో రోజున సుబ్బారావు, అప్పారావు కలిసి కట్టుగా, అతని స్నేహితుడు సుధాకర్ దగ్గరకు వెళ్ళి-

"అయ్యా! ఇంట్లో గడవడం చాలా ఇబ్బందిగా వుంది. సరుకులన్నీ నిండుకున్నాయి. ఏదైనా వుంటే సాయంచెయ్యండి!" అని అడిగారు.

సుధాకర్ వారి మాటలకు బదులుచెప్పకుండా మౌనం వహించి– కోపంగా చూశాడు. వారిరువురికి విషయం అర్థమైపోయింది. అతని స్థితి చూసి–

"అయ్యా! పోనీ ఏదైనా పనైనా ఇప్పించండి దానయ్యగారొచ్చేంతవరకూ ఏదోలా కష్టపడతాం" అని విచారంగా అన్నారు. వారి ధోరణి చూసి– "అయితే వెళ్ళిరండి" అని ముభావంగా అన్నాడు.

"మీరే అలా అంటే ఎలా? మీ స్నేహితుడు దానయ్యగారుంటే మీ వరకూ ఎందుకొస్తాం? ఆ ధర్మప్రభువు మా అవసరాలకు తగినంత దానంగా ఇచ్చి ఆదుకునేవారు!" అని నిందారోపణగా అన్నారు.

"ఆ అలా రండి దారికి! అంటే మీలో కష్టపడే శక్తివున్నా, కేవలం అతనిచ్చే దానధర్మాలతో జీవనం గడిపేస్తున్నారు. కష్టపడి సంపాదించని వాడికి జీవించే హక్కులేదు. ఇకనైనా దానధర్మాల మీద ఆధారపడి, సోమరులుగా మారకండి. ప్రస్తుతానికి ఇంటికి వెళ్లిరండి. పనేదైనావుంటే నేనే మీకు కబురంపుతాను!" అని మర్యాద పూర్వకంగా చెప్పి పంపాడు. ఆ ఇరువురికి తమ తప్పిదం తెలిసి బుద్ధి తెచ్చుకుని ఇంటికి మరలిపోయారు.

ఆ వూళ్లో వాళ్లిద్దరినేకాదు– ఇంకా ఇలా దానధర్మాలమై బతికేస్తున్న వాళ్లందరికీ బుద్ధి చెప్పి, వాళ్ళలో దాగున్న సోమరితనాన్ని పారద్రోలి కష్టపడే జీవన సరళిని అలవాటుచేసాడు.



మేఘుడు యాచించకుండానే వర్షాన్నిచ్చునట్లు సత్పురుషుల సహకరిస్తారు.

# దృష్టిలోపం ఇక పాత మాట!

అంధత్వాన్ని, దృష్టి లోపాలను పారదోలే పరిశోధనల్లో ఇదే మేలి మలుపు! వాషింగ్టన్ విశ్వవిద్యాలయానికి చెందిన శాస్త్రవేత్తలు....జీబ్రా చేపల్లో ఉండే జన్యువులను ఉపయోగించి ఎలుకల్లో రెటీనాను విజయవంతంగా పునఃసృష్టించారు. చర్మంవంటి శరీర భాగాలు గాయాలు, కోతలకు గురైనప్పుడు కొద్దిరోజుల్లోనే వాటంతట అవి బాగయిపోతాయి. స్వస్థత కలగడానికి అనుగుణంగా వాటిలోని మూలకణాలు ప్రవర్తించడమే ఇందుక్కారణం! కానీ మనుషుల రెటీనాలోని కణజాలం ఇందుకు భిన్నం. దీనికి ఏ మాత్రం గాయమైనా పాక్షికంగానో పూర్తిగానో చూపు కోల్పోవడం జరుగుతుంది.

అయితే జీబ్రా చేపల రెటీనాకు మాత్రం తనంతట తానుగా స్వస్థత కలిగించే ఎఎస్‌సీఎల్ 1 జన్యువుకు ఆశ్రయమివ్వడం వల్లే ఇది సాధ్యమవుతున్నట్లు పరిశోధకులు గుర్తించారు. దీంతో ఇదే జన్యువును ఎలుకల రెటీనాలోని మూలకణాల్లో ప్రవేశపెట్టారు. తర్వాత టామోక్సిఫెన్ ఔషధం ఇవ్వగా కొద్ది రోజుల్లోనే ఎలుకలు కాంతిని గుర్తించడం విశేషం!

ఇదే విధానంలో చికిత్సలు అందుబాటులోకి వస్తే మనుషుల్లో అంధత్వం ఇక పాత మాటే కానుందన్న ఆశలు చిగురిస్తున్నాయి.

# గూగల్ శోధనతో మధుమేహ జాడ గుర్తింపు!

బరువు తగ్గడం ఎలా? ధూమపానాన్ని ఎలా మానుకోవాలి? అని ప్రపంచ వ్యాప్తంగా చాలా మంది ఆన్‌లైన్‌లో శోధిస్తుంటారు.

ఇవన్నీ చాలా మటుకు మధుమేహం తోడు సమస్యలే! ఎంతమంది ఏ ప్రాంత ప్రజలు గూగుల్ సెర్చ్‌లో ఈ సమస్యలకు పరిష్కారాలను వెతుకుతున్నారన్నది తెలుసుకోవడం ద్వారా ఆయా చోట్ల చక్కెర వ్యాధికి దారి తీస్తున్న పరిస్థితుల్లో మార్పు తీసుకురావచ్చనీ, వ్యాధి విస్తరణ తీరునూ తెలుసుకోవచ్చని తాజా అధ్యయనం వెల్లడించింది. వార్విక్ విశ్వవిద్యాలయానికి చెందిన పరిశోధకులు గూగుల్ సెర్చ్‌లో లండన్ వాసుల శోధన వివరాలను, గత ఆరోగ్య సర్వేలోని వివరాలతో పోల్చి చూశారు.

2015లో 21.8 శాతం మంది బ్రిటన్ వాసులు సొంత వైద్యంకోసం ఇంటర్నెట్‌ను ఆశ్రయించారట. ఇలా ప్రజల ఆన్‌లైన్ శోధన తీరును అవగాహన చేసుకోవడం ద్వారా....వాస్తవ ప్రాతిపదికన ప్రాంతీయంగా ఆరోగ్య చికిత్సా విధానాలను రూపొందించవచ్చని వారు పేర్కొన్నారు

- గండూరి రేణుక, మధురాపురం



# ఏనుగు తొండము!

సిరిపురారణ్యములో ఏనుగు, కోతి, దున్న పోతు స్నేహంగా వుండేవి. ఎక్కడకు వెళ్ళినా కలిసే వెళ్లేవి. వాటి స్నేహము చూసి మిగతా జంతువులు ఓర్వలేకపోయేవి.

ఇలా ఎన్నో ఏండ్లు స్నేహితము చెక్కుచెదర కుండా కొనసాగింది. ఒకరోజు అనుకోకుండా సర్కస్ వాళ్ళకంట పడ్డది ఏనుగు. సర్కస్ వాళ్లు తాళ్ళతో బంధించి, అంకుశంతో పొడిచి ఏనుగును వశపరచుకొని సర్కస్ కొరకు తోలుక వెళ్లారు. ఏనుగు తమనుండి దూరమైనందుకు కోతి, దున్నపోతు ఎంతో విచారించాయి. చేసేది లేక దున్నపోతు, కోతి యదావిధంగా స్నేహం కొనసాగించాయి.

ఆ అడవిగుండా వెళ్లే రైతు దున్నపోతును చూసి బలవంతంగా కొమ్ములకు తాడుకట్టి తన వ్యవసాయానికై కొట్టుకుంటూ తీసుకు వెళ్లాడు.

తన నేస్తాలు ఏనుగు, దున్నపోతు పోగా కోతి ఒక్కటే మిగిలింది. పళ్లు, కాయలు తింటూ అరణ్యములోనే ఉండిపోయింది.

ఒకనాడు కోతులనాడించి గడిపేవాడు కోతిని ఆడించి పొట్టపోసుకోవడానికి కోతిని వెంటబెట్టు కొని వెళ్లాడు.

ఇలా మూడు జంతువులు తలా ఒకదిక్కై నాయి. రైతు దున్నపోతును పొలం దున్నడానికి ముల్లుకర్రతో వెన్నుపై బాగా పొడిచేసరికి చార డంతా వెలుపు పుండైంది.

దున్నపోతు పుండుపై ఈగలు వాలకుండా తోకతో విసురుకుంటుండేది. దున్నపోతి వెన్నుపై పుండును చూసి కాకి పుండును కొరికి తినడం ప్రారంభించింది. తోకతో విసురుకున్నప్పుడల్లా

ఎగిరిపోయేది, మళ్లీ వాలేది. తోకతో ఎంత వారించినా పుండుపై వాలుతూనే వుండేది.

ఇదిలా వుండగా కోతి ఎట్లో తప్పించుకుని దున్నపోతు దగ్గరకు వచ్చింది. కోతి రావడంతో దున్నపోతుకు ఎంతో సంతోషం కలిగింది.

దున్నపోతి వెన్నుపై పుండును చూసిన కోతి కారం పుండుపై చల్లితే తక్కువవుతుందని సలహా ఇచ్చింది. అదీకాక, కాకులుకూడా మిరియం పొడి నోటికి తాకడమువల్ల కలిగే మంటకు పుండుపై వాలవన్నది.

"అయితే మిత్రమా! నేను బాధతో ఇబ్బంది పడుతున్నాను. దయచేసి మిరియంపొడి ఎక్కడ నన్నా దొరికితే తెచ్చి పుండుపై చల్లవా!" అని కోతిని వేడుకుంది దున్నపోతు.

'సరే'నంటూ వెళ్లిన కోతి- ఎక్కడో కారం దొంగిలించి తెచ్చి దున్నపోతు వెన్నుపై గల పుండుపై చల్లింది. "అబ్బ... అబ్బ... బాధ...బాధ..." అంటూ గిలగిల కొట్టుకుంటూ భూమి దద్దరిల్లేటట్లు అరిచింది దున్నపోతు.

ఆ అరుపులు విన్నది ఏనుగు. నీళ్లు తాగించ డానికి తోలుకుపోతున్న మావటివాళ్లను తొండ ముతో అక్కడ, ఇక్కడ గుద్ది, గెదిమి పరుగు పరుగున దున్నపోతు దగ్గరకు వచ్చింది.

దున్నపోతు బాధతో గిలగిల కొట్టుకుంటూ కిందపడి పొర్లుతుంటే కోతి విరగబడి నవ్వ సాగింది. దున్నపోతు ద్వారా విషయం తెలుసు కున్న ఏనుగు తొండముతో నీళ్లు తెచ్చి దున్న పోతు పుండును కడిగింది.

దున్నపోతుకు నొప్పి తగ్గింది. కోతి అలాగే తన చేష్టలకు విరగబడి నవ్వుతూనే వుంది. ఇది చూసి ఏనుగుకు ఆగ్రహం తారస్థాయికి చేరడ ముతో- తొండముతో కోతిని పట్టిలాగి నేలకు చరిచింది.

కోతి ఒక్కదెబ్బకే ప్రాణాలు విడిచింది. అప్పటినుండి సర్కస్‌లో వున్న ఏనుగైనా, రైతు వద్ద పొలందున్నే దున్నపోతైనా అప్పుడప్పుడు కలుసుకుంటూంటాయి. యోగక్షేమాలు తెలుసు కుంటూ స్నేహాన్ని కొనసాగించాయి.





ఎదుటి వారి ధనసంపదపై ఆశ పడటం ఎప్పటికీ బాధనే మిగులుస్తుంది.



# తెనాలి రామలింగడి ఉపాయం!

రాయలవారు ఓసారి దిగులుతో దీర్ఘాలోచనలో వున్నారు. తెనాలి రామలింగడు ఇది గమనించి విషయమేమిటని అడిగాడు. రాయలవారు, "రామలింగ! యుద్ధాలు లేకుండా, అన్ని దేశాలు చుట్టు ప్రక్కలివి, శాంతిగా, మైత్రిగా కొనసాగే ఉపాయం చెప్పు. అలా చేస్తే అందరూ, అన్ని దేశాలు సుభిక్షంగా జీవించవచ్చు" అన్నారు.

రామలింగడు చుట్టుప్రక్కల అన్ని దేశాలకు వర్తమానం (ఒకరికి తెలియకుండా ఇంకొకరికి) పంపించాడు. 'వారి ప్రతినిధి వచ్చి "అత్యుత్తమ దేశం, జాతి, మతం, కులం, భాష" పురస్కారం తీసుకెళ్లాలని".

కాని వస్తూవస్తూ "దారి వీధిలోని కుక్కలు ఎన్నిఉన్నాయో సుమారుగా చెప్పాలి.

ప్రతి ప్రతినిధి వచ్చి జవాబిచ్చినపుడు, "మీ వీధిలోని కుక్కలు (మీరు వాటిని చూస్తూ లెక్కించేటప్పుడు) మిమ్మల్ని పట్టించుకున్నాయా" అని అడిగాడు. ఒక్కరొక్కరూ, "మా వంకకూడా చూడలేదు" అని జవాబిచ్చారు.

మరునాడు 'రాజ-సభలో హాజరయిన అన్ని దేశాల ప్రతినిధులతో రామలింగడు అన్నాడు, "వీధి కుక్కలుకూడా పట్టించుకోవు మనల్ని, మరి ఎందుకు నేను, నా, నాది అనే అహంతో బతకాలి మనం? అందరిదీ ఒకే రక్తం. అంటే ఈ సృష్టిలోని అన్ని జంతువులు, భగవంతుడి

పి.ఎస్. నిత్రితిశ్రీలేఖ - సికింద్రాబాద్

దృష్టిలో సమానం. అన్ని జీవులు ఆ భగవంతుడి సంతానం. అంటే మనమంతా ఒకే కుటుంబం యొక్క సభ్యులం. అదే వసుధైక కుటుంబం. అన్ని జీవులలో మనిషి జీవనం ఉత్తమం. ఎందుకంటే 1. దేవుడు మనకి విచక్షణా జ్ఞానాన్ని, 2. మంచిగా ఆలోచించే తత్వాన్ని, శక్తిని ఇచ్చాడు కనుక.

ఈ జీవితం తాత్కాలికం కదా! అందరూ ఒకనాడు చచ్చేదే! అందుకే మనం తారతమ్యాలు లేకుండా, భేద భావాలు లేకుండా, కక్షలు మరియు యుద్ధాలు లేకుండా, మైత్రీ భావంతో, ఒకరికొకరు సహాయం చేసుకుంటూ మెలుగుదాం. హింస, జీవహింస, శత్రుత్వం లేకుండా కలిసి ఉందాము!" అన్నాడు.

ఈ మాటలు ప్రతినిధుల ద్వారా ఆ దేశాల రాజులు విన్నారు. వారి హృదయాలకు రామలింగడి సూక్ష్మపు, దూరదృష్టితో కూడిన మాటలు సున్నితంగా తాకాయి. అది వారి మేలుకొలుపు, కనువిప్పు కలిగించింది. తరువాత విజయనగరంతో పాటు చుట్టుప్రక్కల దేశాలు ప్రశాంతతతో కూడిన సుభిక్షంతో వర్ధిల్లాయి. త్వరలోనే బాగా ప్రగతి చెందాయి.

నీతి - 1. నేను, నా, నాది అనే అహం వీడితే ప్రపంచశాంతి, ప్రగతి తేలికగా స్థాపించొచ్చు.

2. ఎందుకంటే అహం లేకుంటేనే మైత్రీ భావం, "సర్వేజనో సుఖినోభవంతూ" అనే తత్వం ఏర్పడతాయి, ప్రతి మనిషిలో.



## వేదోద్ధరణం - స్వామివారి వేదపరిరక్షణాదీక్ష !

ఒకసారి శంకరాచార్య శ్రీచంద్రశేఖర స్వామివారు చిత్తూరు జిల్లా కాళహస్తిలో బసచేసి ఉన్నప్పటి సంగతి ఇది.

అప్పట్లో అన్నమయ్య కృతులు అంత ప్రాచుర్యాన్ని సంతరించుకోలేదు. స్వామివారు అనుష్ఠానంలో ఉండగా ఒక గాయకుడు అన్నమయ్య కృతి పాడుతున్నాడు. అందులో "వేదోద్ధర శ్రీవేంకటనాయక" అన్న పదమున్నది. స్వామివారు అనుష్ఠానం అయిన తరువాత ఆ గాయకుని పిలిపించి ఆ చరణాన్ని మళ్ళీ మళ్ళీ పాడమని పాడించుకున్నారు.

అదే సమయంలో అప్పటి దేవాదాయ శాఖ ఉన్నతాధి కారులు, టీటీడీ కార్యనిర్వహణాధికారి స్వామివారిని తిరుమలకు ఆహ్వానించడానికై వచ్చారు. స్వామివారు ఆ పాట చరణాన్ని వినిపింపజేసి వేదోద్ధరుడైన వేంకటేశ్వరస్వామి సన్నిధిలో నాకు వేదోద్ధరణకై ప్రణాళిక వేసి భిక్షగా ఇవ్వాలి - అని కోరారు. ఆ స్వామికి వీరు సమర్పించిన మాల కూడా విలక్షణమైనది.

స్వామివారు వేదవిద్వాంసులతోకూడి వేంకటేశ్వరస్వామి సన్నిధికి చేరారు. వేదవిద్వాంసులందరిని ఒక మాలవలె నుంచోమని తాము కొలికి పూసగా వేదపారాయణంచేసి "సన్యాసినైన నేను స్వామికి వేదమాలను సమర్పిస్తు న్నాను. స్వామి వేదరక్షణకు తగు విధంగా అనుగ్రహించాలి" అని ప్రార్థించారు. అప్పటి తిరుమల యాజమాన్యం వారు నియమాధ్యయన విద్యార్థి స్కీమ్, శ్రౌత సత్కార్మానుష్ఠాన విద్యా అభివందనస్కీమ్, వేదశాస్త్ర ఆగమ విద్వత్ సదస్సు, వేదశాస్త్ర ఆగమ విద్యాకేంద్రం, కుమారా ధ్యాపక స్కీమ్, మొదలైన ప్రణాళికలను ఎన్నిటినో ఆచరణలోనికితెచ్చారు.

వేదపండితులపై, వేదవిద్యార్థులపైన స్వామివారి ఆదరము అంతింత అని చెప్పనలవికాదు. ఒకసారి స్వామివారు ఒక విద్యార్థిని దగ్గరగా కూర్చోపెట్టుకుని అతను చెప్పే వేదపనసలు వింటున్నారు. ప్రక్కనే ఉన్న ఒక కమలాపండు ఒలిచి దానికి పంచదార తెప్పించి అద్ది ఒక్కొక్క పనస పూర్తి అవగానే ఆ విద్యార్థికిచ్చి అతను తినేదాకా ఎంతో ఆదరంతో ఆగి, మళ్ళీ వేరొక పనస వింటున్నారు. వారి నిరంతరమైన ఉద్యమం, వేదవిద్య యెడగల ఆదరం వలననే ఈ నాటికి ద్రవిడాంధ్రదేశాలలో వేదవిద్య మహత్తరమైన స్థానాన్ని అందుకుంది.

ఆయా అవసరాలననుసరించి స్వామివారు ఏర్పాటు చేసిన సంస్థలు వేదవిద్యా వ్యాప్తికి ఎనలేని మేలు చేసాయి.

- కె. గీత, హైదరాబాద్

స్వామి వారు అఖిల భారత వేద సదస్సులు ఏర్పాటు చేయించారు. 1962లో ఢిల్లీలో జరిపించిన వేద సదస్సులో వేదవ్యాసుడు విభజించిన 1131 వేదశాఖలలో కేవలం 10-12 శాఖలు మాత్రమే ప్రాచుర్యంలో ఉన్నట్లు కనుగొన బడింది.

1965లో మద్రాసు సదస్సు. 1966లో తిరుపతి సదస్సు, 1968లో విజయవాడ సదస్సు, 1973లో న్యూఢిల్లీ సదస్సు, 1979లో తిరుపతి సదస్సులు స్వామివారి ప్రోత్సాహంవలన జరిగాయి.

భారతదేశం మొత్తంమీద 1750 మంది వేదపండితులు, వారిలో ఎక్కువ మంది యాభై సంవత్సరాల వయస్సుకుపైబడిన వారున్నారని 650 మంది మాత్రమే విద్యార్థులున్నారని తేలింది. అయితే స్వామి వారుతీవ్ర ప్రయత్నాలవలన ఇప్పుడు పరిస్థితి ఎంతో మెరుగ్గా ఉంది.

లుప్తమైపోతున్న వేదశాఖల ఉద్ధరణ ప్రయత్నంలో 1962లో మహారాష్ట్ర నాసిక్ ప్రాంతాలలో యజుర్వేదానికి సంబంధించిన మైత్రాయణీ శాఖ పండితులు నలుగురున్నారని తెలిసింది. వెంటనే ఎనిమిది మంది విద్యార్థులతో అక్కడ పాఠశాల ఆరంభింపబడింది. సామవేద జైమినీ శాఖలో ఒకే ఒక పండితుడున్నట్లు తెలిసింది.

అతడు కట్టెలమ్మే దుకాణంలో గుమాస్తాగా పనిచేసేవాడు.

1964లో పాఠశాల ఆరంభించి ఎనిమిదేళ్ళలో నలుగురు పండితులను తయారుచేశారు. తొమ్మిది మంది విద్యార్థులతో పాఠశాల నడిచింది. ఏడెనిమిది విద్యార్థులతో పాఠశాల ఆరంభింప చేశారు.

అధర్వశౌనక శాఖకు సంబంధించి గుజరాత్‌లో ఒకే ఒక పండితుడుండగా స్వామివారు ఇద్దరు కృష్ణయచజుర్వేద క్రమ పాఠీలను ఆ శాఖ నేర్చుకోవడానికి పంపారు. వారు ద్వితీయ ద్వివేదులైనారు. తరువాత ఏడుగురు ఆ పాఠశాలలో ఉత్తీర్ణులైనారు.

కీ.శే. శ్రీ పి.వి.నరసింహారావు మానవ వనరులశాఖ మంత్రిగా ఉండగా ప్రాచీన వేద విద్యాపద్ధతిని సంరక్షించే ఆలోచనతో కొన్ని సెమినార్లు నిర్వహించారు. స్వామివారు తమ ప్రతినిధిగా వేద రక్షణ నిధి ట్రస్ట్ బహుకాలం ప్రధాన ట్రస్టీగా పని చేసిన శ్రీ అన్నాదురై అయ్యంగార్‌ను పంపారు. శ్రీనరసింహారావు ఆయననే ప్రభుత్వ సలహాదారుగా నియమించారు. మంత్రిత్వ శాఖలో భాగంగా రాష్ట్రీయ వేద విద్యా ప్రతిష్ఠాన్ ఆరంభించబడింది. గురువులకు విద్యార్థులకు నెలసరి ఆర్థిక సహాయం అందించడం, ప్రతి సంవత్సరం పరీక్షలు నిర్వహించడం ద్వారా ఈ ప్రతిష్ఠానం వేదవిద్యను ప్రోత్సహించింది. ఇప్పుడు ఈ సంస్థ ఉజ్జయినీలో స్వయంప్రతిపత్తిగల సంస్థగా పని చేస్తోంది. ఇది మహాస్వామివారి కృషి వల్లనే సాధ్యమైంది.

ఈ విధంగా మహాస్వామివారు వేదోద్ధరణకై చేసిన కృషి, దాని ఫలితాలు చెప్పుకుంటూ పోతే - ఒక పెద్ద పుస్తకమే అవుతుంది.



కాలిన ఇనుముమీద పడ్డ నీటిబొట్టు ఊరుపేరు లేక నశిస్తుంది



# క్రోధానికి విరుగుడు శాంతం!

ఒకనాటి సాయంత్రం శ్రీకృష్ణుడు, బలరాముడు, సాత్యకి వన విహారానికి వెళ్లారు. కాలక్షేపంగా కబుర్లు చెప్పుకుంటూ వెళుతూండటంతో కాలం తెలియలేదు. చూస్తుండగానే చీకటి వ్యాపించింది వారి చుట్టూ. చీకటి ముసురుకునే వేళకు ముగ్గురూ ఒక కీకారణ్యంలోకి చేరుకున్నారు. ముందుకు సాగడానికైనా, వెనక్కు మళ్ళడానికైనా ఏమాత్రం అనువుగాని సమయం. ఇక చేసేదేమిలేక ఆ రాత్రికి ఎలాగోలా ఆ కీకారణ్యంలోనే గడపాలని నిశ్చయించుకున్నారు.

అడవిలో ముగ్గురూ ఒకేసారి ఆదమరచి నిద్రపోవడం క్షేమంకాదని అందువల్ల ఇద్దరు నిద్రిస్తున్నప్పుడు మిగిలినవారు కాపలా వుండాలని ఇలా వంతులవారీగా మేల్కొని కాపలా వుంటూ ఆరాత్రి గడపాలని అనుకున్నారు. ముందుగా శ్రీకృష్ణుడు, బలరాముడు ఒక చెట్టుక్రింద నిద్రకు ఉపక్రమించారు. సాత్యకి వారికి కాపలాగా మేలుకొని ఉన్నాడు. ఒళ్ళంతా కళ్ళు చేసుకుని, చుట్టూ గస్తీ తిరగసాగారు.

అంతలో ఒక రాక్షసుడు కృష్ణ బలరాముల వైపు వడివడిగా అడుగులేస్తూ రావడం కనిపించింది. సాత్యకి పరాక్రమంతో వెంటనే ఆ రాక్షసుణ్ణి అడ్డగించాడు. వాడుకూడా భీకరంగా సాత్యకిపై యుద్ధానికి సిద్ధపడ్డాడు. సాత్యకి క్రోధావేశాలతో తన గధాయుధంతో అతడిని ఎదుర్కొన్నాడు. సాత్యకిలో క్రోధం మొదలైన మరుక్షణమే ఆ రాక్షసుడి శరీరం రెట్టింపైంది. సాత్యకికూడా

భల్లం వెంకట్రాజు - పైడిపర్రు



బలరాముడు అటూ ఇటూ తిరుగుతూ కాపలా కాస్తున్నాడు. సాత్యకికి ఎదురైన రాక్షసుడే బలరాముడికీ ఎదురయ్యాడు. యుద్ధానికి కవ్వించాడు. బలరాముడు అసలే ప్రథమ కోపి. కట్టలు తెంచుకున్న కోపంతో తన హలాయుధాన్ని ఎత్తి రాక్షసుడిపై దాడిచేసాడు.

రాక్షసుడు వికటాట్టహాసం చేస్తూ తన శరీరాన్ని పెంచాడు. బలరాముడి కోపం మరింత పెరిగింది, కోపంతోపాటే రాక్షసుడి శరీరంకూడా పెరుగుతూ రాసాగింది. చివరకు భీకరాకారం దాల్చిన రాక్షసుడు బలరాముడిని కూడా మట్టి కరిపించి, వెనుదిరిగాడు.

ఇంతలో తనవంతు కాపలా కాయడానికి శ్రీకృష్ణుడు మేలుకున్నాడు. ఇంకా తెల్లవారలేదు కదా, ఓ కునుకు తీయమన్నాడు బలరాముడిని. రాక్షసుడి ధాటికి ఒళ్లు హూనమైన బలరాముడు నెమ్మదిగా చెట్టుక్రిందకు చేరుకుని నడుం వాల్చాడు. వెంటనే నిద్రలోకి జారుకున్నాడు. శ్రీకృష్ణుడు అటూ ఇటూ కలియ తిరుగుతూ కాపలా కాయసాగాడు.

కొద్దిసేపటికి సాత్యకిని, బలరాముని మట్టి కరిపించిన రాక్షసుడు శ్రీకృష్ణుని ఎదుటికి వచ్చాడు. యుద్ధం చేయమంటూ కవ్వించాడు. శ్రీకృష్ణుడు చిరునవ్వులు చిందిస్తూ సైఅన్నాడు. రాక్షసుడు కృష్ణుడి మీదకు లంఘించాడు. కృష్ణుడు ఒదుపుగా తప్పించుకున్నాడు. ప్రశాంతంగా అతడివైపు చూసి మల్లయుద్ధానికి చెయ్యి కలిపాడు. రాక్షసుని శరీరం సగానికి సగం

కోపం మరింత పెరిగింది. రాక్షసుడి శరీరం ముందుకన్నా బాగా పెరిగింది. సాత్యకి కోపం చల్లారకపోగా అంతకంతకూ పెరగటంతో రాక్షసుడి శరీరం విపరీతంగా పెరిగింది. రాక్షసుడి శరీరం ముందు సాత్యకి ఆటబొమ్మలా కనిపించసాగాడు.

రాక్షసుడు సాత్యకిని ఎత్తి పట్టుకొని గిరగిరా తిప్పి కిందపడేసి వెళ్లిపోయాడు. గాయాల పాలైన సాత్యకి కొద్దిసేపటికి శక్తి కూడదీసుకుని తెప్పరిల్లాడు.

అదే సమయానికి మేలుకున్న బలరాముడు ఇక తాను కాపలాగా వుంటాననిచెప్పి, సాత్యకిని నిద్రపొమ్మన్నాడు. రాక్షసుడితో పోరులో అలసి సొలసిన సాత్యకి నెమ్మదిగా చెట్టుకిందకు చేరుకుని ఆదమరచి నిద్రలోకి జారుకున్నాడు.



ధీరులు ఎప్పుడూ తామనుకున్న పని పూర్తి చేసే వరకూ విశ్రమించరు

తగ్గిపోయింది. అతడు ఎంతగా కవ్విస్తున్నా కృష్ణుడు చెక్కుచెదరని చిరునవ్వుతో అతడిని ఎదుర్కోసాగాడు. శ్రీకృష్ణుడు ప్రశాంతంగా చిరు నవ్వులు చిందిస్తున్న కొద్దీ రాక్షసుడి శరీరం అంతకంతకూ తగ్గిపోసాగింది. ఇవరకు గుప్పిట్లో పట్టేంత చిన్నగా తయారయ్యాడు ఆ రాక్షసుడు. శ్రీకృష్ణుడు ఆ రాక్షసుడిని అరచేత పట్టుకుని, తన ఉత్తరీయం అంచుకు మూటలా కట్టేసాడు.

కొద్దిసేపటికి తెల్లవారింది. అడవిలో పక్షుల కిలకిలా రావాలు మొదలయ్యాయి. సాత్యకి, బలరాముడు మేల్కొన్నారు. తమ దగ్గరే వున్న కృష్ణుడిని చూసారు. తమ ఒంటిమీదున్న గాయా లను చూసుకున్నారు. రాత్రి తమకు కనిపించిన రాక్షసుడి గురించి చెప్పారు. "అలాంటి రాక్షసుడు నీకు కనిపించలేదా?" అని అడిగారు.

"వీడేనా ఆ రాక్షసుడు..." అంటూ తన వుత్త రీయం అంచున కట్టిన మూటను విప్పాడు కృష్ణుడు. అందులోంచి బయటపడ్డాడు గుప్పె డంత పరిమాణంలో వున్న రాక్షసుడు. బలరా ముడు, సాత్యకి ఆశ్చర్యపోయారు. "నిన్న మాకు కనిపించింది వీడే! అయితే, అప్పుడు బాగా పెద్దగా వున్నాడు. కోపంగా అతడితో పోరు సాగించేకొద్దీ మరింతగా పెరిగిపోసాగాడు..." అని వాళ్లు చెప్పారు.

"ఈ రాక్షసుడు మూర్తీభవించిన క్రోధం. క్రోధానికి విరుగుడు క్రోధం కాదు, శాంతం. మీరిద్దరూ కోపంతో రెచ్చిపోయి తలపడ్డారు. అందుకే ఇతడి చేతుల్లో పరాజితులయ్యారు." అని చెప్పాడు కృష్ణుడు. అప్పుడు జ్ఞానోదయ మైంది సాత్యకి, బలరాములకు. తమ అవివే కానికి సిగ్గుపడ్డారు.



మనిషిలోని మనసుకు ఉత్సాహం అనేది పగటి వెలుతురును ప్రసరిస్తుంది.

అలా బయటపడిన ఆ రాక్షసుడు అల్లంత దూరాన ప్రవహిస్తున్న నది ఒడ్డున పెద్ద ఊడల మర్రిచెట్టుకు చేరుకున్నాడు. అక్కడ మళ్లీ మామూలు భీకరరూపం దాల్చి తన మిత్రులను, సేవకులను పిలిచాడు. అతడి పిలుపువిన్న ఆ రాక్షసమూకలు వికృత రూపాలతో హాహా కారాలు చేస్తూ ఆ చెట్టుకొమ్మల్లోంచి బయటకు వచ్చారు. వారికందరికీ వీడే నాయకుడు. వీడేది చెయ్య మంటే అది చెయ్యకపోతే వాడు వాళ్ళందర్నీ నిర్దాక్షిణ్యంగా చంపేస్తాడు. అందుకే వారు వాడెలా చెప్తే అలా చెయ్యడానికి సిద్ధమయ్యారు.

"మనందర్నీ ఈ నల్లగొల్లోడు చంపడాని కొచ్చాడు. మీరందరూ ఏకమై ఒక్కసారిగా, వాడిపై దండెత్తి హతమార్చాలి. మీమీ ఆయుధా లతో వాడిపై విరుచుకుపడండి... నేనూ మీకు సహకరిస్తాను. ఇప్పుడు మనం ఉపేక్షిస్తే తరువాత ఎప్పుడైనా వాడు మనల్ని చంపటం ఖాయం. అందుకు ఇప్పుడే మనం వాడిపై ఒక్కుమ్మడిగా విరుచుకుపడదాం. హు!..బయల్దేరండి..." అంటూ తన రాక్షస వీరులను తోడ్కొని కృష్ణుడిపైకి దూసుకువచ్చాడు.

సాత్యకి, బలరామకృష్ణులు ఆ కీకారణ్యానికి ఆమడ దూరంలోగల చిన్న పర్వతంపై కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నారు.

దూరం నుంచి హాహాకారాలు చేస్తూ ప్రవాహంలా వస్తున్న ఆ రాక్షస మూకను చూసాడు కృష్ణుడు.

"రాక్షసబుద్ధి పోనిచ్చుకున్నారు కాదు. వారు తమ చావును తామే కొనితెచ్చుకున్నారు. వీళ్ల నిక వదలకూడదు. సాత్యకి, బలరాములకు క్రోధాన్ని జయించమనే నీతి బోధించుటకు చేసింది. ఈ రాక్షసులకు అలుసై, నన్నే మట్టు పెట్టుటకు సిద్ధమై వస్తున్నారా!' తన అవతారాన్ని ఒక్కసారి కళ్ళు మూసుకుని తలచుకోగానే, శ్రీమహావిష్ణువై భూమ్యాకాశాలు దద్దరిల్లేటట్టు హూంకరించి, తన సుదర్శన చక్రాన్ని ప్రయో గించాడు వాళ్ళపై. ఆ అద్వితీయ విష్ణురూపా యుధం ఆ రాక్షసమూకలను వెంటాడి నరు క్కుంటూ వెళ్ళింది. రాక్షసులందరూ హతమ య్యారు. సాత్యకి బలరాములు నమస్కరించారు.





# మౌన వ్రతం !

**కాం**తమ్మ పరమ గయ్యాళి. ఆమెకు ఒకతే కూతురు. కానీ కాంతమ్మ గురించి తెలిసిన ఆ వూర్లో ఆ అమ్మాయికి పెళ్లిచేసుకోవడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు.

కాంతమ్మ భర్త కనకయ్య చాలా నెమ్మదస్తుడు. కూతురు పెళ్ళికి పొరుగూరిలో సంబంధాలు వెదుకసాగాడు. ఉన్నట్టుండి పొరుగూరిలో ఒక సంబంధం వచ్చింది. కనకయ్య ఎంతో సంబర పడ్డాడు. కానీ ఆ సంతోషం మూన్నాళ్ల ముచ్చట అయింది. ఆ పెళ్లికొడుకు వారికి కనకయ్య ఊరిలో బంధువులు వుండటంవలన, వారు కాంతమ్మ గురించి చెప్పడంవలన వారు పెళ్లి చూపులకు రావడమే మానుకున్నారు.

ఇక కనకయ్య దూర గ్రామాల సంబంధాలు వెతకటం ప్రారంభించాడు. అంతేకాక తన భార్య నోటి దురుసుతనం కట్టడి చేయటానికి ఒక సాధువును సలహా అడిగాడు.

ఆ సాధువు ఆమెను పెళ్లిచూపులు అయ్యేంత వరకు మౌనవ్రతం ఆచరింపమని కనకయ్యకు చెప్పాడు. ఈ సంగతి కనకయ్య తన భార్యకు చెప్పాడు. కూతురుపైన గల ప్రేమతో ఆమె అందుకు అంగీకరించింది.

దూరగ్రామంలో ఒక సంబంధం వారు కనకయ్య కూతురుని చూడడానికి వచ్చారు. వచ్చినవారు కనకయ్య కూతురును "వంటా వార్పు వచ్చా!" అని ప్రశ్నించారు.

అల్లి రామకృష్ణ – కలిగిరి

అంతవరకు మౌనంగా వున్న కాంతమ్మ ఒక్కసారి మౌనవ్రతాన్ని మరచి, "వంటావార్పు నేర్పనిదే పిల్లకు పెళ్లిచేస్తామా ఏమిటి!" అని గయ్యిమని లేచింది. పెళ్లిచూపులకని వచ్చిన వారు ఆమె మాటలను చూసి భయపడి తిరిగి రానేలేదు.

వారు వెళ్లిన తర్వాత కనకయ్య తలబాదుకుని భార్యను ఆ సమయంలో మాట్లాడవద్దని, మౌనవ్రతం పాటించమని సలహా ఇచ్చాడు. ఆమె సరేనంది.

మరొకసారి దూర గ్రామంనుండి ఒక సంబంధం వచ్చింది. వారు లోపలికి రాగానే అందరినీ కుశల ప్రశ్నలు వేశారు. కాంతమ్మను కూడా పలకరించారు.

కాంతమ్మ భర్తకిచ్చిన మాట ప్రకారం మౌనంగానే వుంది. "ఈమె ఎందుకు మాట్లాడ్డం లేదు" అని వారు కనకయ్యను ప్రశ్నించారు. ఆమెది మౌన వ్రతం అని కనకయ్య జవాబిచ్చాడు. "ఈమె మౌనవ్రతంలో వుంటే మేం ఈవిడతో ఏ మాట్లాడుతాం" అని వారనగానే కాంతమ్మ, "నాది మౌనవ్రతం కాదు. మా ఆయనకు ఇచ్చిన మాటప్రకారం మౌనంగా వున్నాను" అని జవాబిచ్చింది.

ఈ అబద్ధాలు విన్న పెళ్లికొడుకువారు వీరిని నమ్మకూడదని తిరిగి వెళ్లారు. కనకయ్య భార్యతో అసలే మాట్లాడవద్దని, ఎవ్వరు ప్రశ్న వేసినా జవాబు ఇవ్వవద్దని సలహా ఇచ్చాడు. ఆమె సరేనంది.





ఆచరణ అర్థవంతంగా ఉండటానికి అంతరంగం అందంగా ఉండాలి

మళ్ళీ కొన్ని రోజులకు మరొక గ్రామం నుండి ఒక సంబంధం పెళ్లిచూపులకని వచ్చింది. వారు అమ్మాయిని చూసి పెళ్ళికి అంగీకరించారు. పెళ్లి ఘనంగా చెయ్యమన్నారు. అంతేగాకుండా తమ బంధువుల నందరినీ చక్కగా చూసుకొమ్మన్నారు.

సరేనన్నాడు కనకయ్య. కాంతమ్మ మాట్లాడక పోయేసరికి "ఈమెకు ఏమన్నా చెవుడా!" అని పెళ్లికొడుకు తల్లి ప్రశ్నించింది. కాంతమ్మకు అరికాలిమంట నెత్తికెక్కి, "నీకు చెవుడు, నీ భర్తకు చెవుడు. మీ అందరికీ చెవుడు!" అని తిట్లదండం అందుకుంది.

దీనితో ఆ సంబంధంకూడా తప్పిపోయింది. చివరకు దీనితో కనకయ్య ఆమెను మౌనంగా వుండవద్దని, మాట్లాడమని చెప్పాడు. కనకయ్య బంధువులు పెళ్లిచూపులకని రాగా, వారికి కాంతమ్మ గురించి ముందే తెలిసి వుండటం వలన వారు ఏమీ అనలేదు.

ఆమె పైకి దురుసుగా వున్నా లోపల మెత్తని మనిషని వారు గ్రహించి ఉండటంవలన వారు ఈ సంబంధానికి అంగీకరించారు.

కనకయ్య కూతురుకు విషయం తెలిసి సంతోషంగా వుంది. కనకయ్య కూతురు వివాహం వైభవంగా జరిగింది.

కాంతమ్మ క్రమంగా తన నోరును అదుపులో పెట్టుకొని ఉత్తమ ఇల్లాలు అనిపించుకుంది.

నోరును అదుపులో పెట్టుకోకుంటే ఎన్నో అనర్థాలు జరుగుతాయి.



# శ్రద్ధ కల కర్మలే సత్కర్మలు!

శ్రద్ధ ఒక అద్భుత శక్తి. ఇది సర్వప్రాణి కోటిలోనూ వ్యాపించి ఉన్న చైతన్యం.

సర్వభూతములందు శ్రద్ధారూపంతో ఉన్న పరదేవతకు నమస్కారం. ఒక విషయంపై ఉన్న విశ్వాసానికి, నిష్ఠకు, 'శ్రద్ధ' అని పేరు. 'ఆస్తిక్యబుద్ధి'అని శాస్త్ర నిర్వచనం. ఒక విషయం నిజం అనీ, అది శ్రేయస్సు కలిగిస్తుందనే విశ్వాసమే శ్రద్ధ. ఆ శ్రద్ధతో ఆ విషయాన్ని గ్రహిస్తే అది తప్పక సత్ఫలితాలనిస్తుంది. ఉదాహరణకు, వైద్యునిపై శ్రద్ధ లేదా నమ్మకం చేతనే అతడు వ్రాసి ఇచ్చిన మందుల్ని ప్రశ్నించకుండా కొంటున్నాం. వాడుతున్నాం. శ్రద్ధ కలిగి, ఇంద్రియాలను నిగ్రహించే వానికి జ్ఞానం లభిస్తుంది. జ్ఞానం పొందినవాడు పరమశాన్తిని అత్యంత శీఘ్రంగా పొందగలడు అని గీతలోని పరమాత్మ వచనం. కఠోపనిషత్తులో వర్ణించిన నచికేతుడు శ్రద్ధకు మారుపేరు. లక్ష్యం సాధించాలన్న శ్రద్ధ ఉంటే బాహ్యాకర్షణలు – మనస్సును చలింపజేయలేవని నచికేతుని చరిత్ర వలన తెలుస్తున్నది.

ఒకసారి మిలింద మహారాజు శ్రద్ధ అంటే ఏమిటో తెలుపమని నాగసేన మహర్షిని అడిగాడు. అప్పుడు ఆ మహర్షి – ఒక కుండలో బురద నీరు తీసుకుని వచ్చి అందులో పటిక రాయిని వేశాడు. వెంటనే నీటిలోని బురదంతా కిందికి దిగిపోయి, నీరు శుద్ధమైంది. మనస్సనే బురద నీటిలో కామవాసనలు, భయం, నిరుత్సాహంఅనే బురద పోగొట్టడానికి శ్రద్ధ పటికలా పని చేస్తుంది అని వివరించాడు. అందువలన మనలో శ్రద్ధ ఉంటే చెడు ఆలోచనలు, చెడు సహవాసాలు మనల్ని పెడత్రోవ పట్టించలేవు. స్వామి రామానందులు వారి శిష్యుడనవ్వాలని కబీర్ దాస్ కోరిక. అయితే తాను మహమ్మదీయుడైనందువల్ల వారు తనని శిష్యుడిగా స్వీకరించరేమోనని అతడి సందేహం. అందువల్ల రామానందుల వద్దనుండి మంత్రోపదేశం పొందాలని రోజూ వారు గంగా స్నానానికి వెళ్ళే త్రోవలో గంగ ఒడ్డున ఉన్న మెట్లమీద పడుకున్నాడు కబీర్. ఉదయం నాల్గుగంటలకు నదీ స్నానానికి వెళుతుండగా చీకట్లో కబీర్ దేహం కాలికి తగలగానే రామానందులు 'రామ రామ రామ' అన్నారు. అది విని దానినే తనకు ఉపదేశించిన మంత్రంగా స్వీకరించాడు కబీర్‌దాస్. ఇటువంటి శ్రద్ధ ఉంటే దేనినైనా సాధించవచ్చు. శ్రద్ధకు తోడుగా ఉండవలసినది విశ్వాసం. శ్రద్ధను ఏకాగ్రత, తత్పరత అని నిర్వచిస్తే విశ్వాసాన్ని 'శుభభావన' అని చెప్పవచ్చు. ఈ రెండూ ఉన్నప్పుడు విజయం లౌకికంగానూ, ఆధ్యాత్మికంగానూ సాధ్యమే. శ్రద్ధతో చేసే పని అయినా సత్ఫలితాలనిస్తుంది.

శ్రద్ధకు భక్తి తోడైతే మనస్సు పరిమళిస్తుంది. గాఢమైన నిష్ఠను కలిగించే శక్తి శ్రద్ధకి ఉంది. నిరంతర పరిశ్రమద్వారా మన ఆలోచనలను పదును పెడితే లక్ష్యాన్ని సులభంగా చేరుకోవచ్చు. శ్రద్ధ కుదరక పోతే బతుకు నడకలో ప్రతిదీ కుంటిదౌతుంది. శ్రద్ధ అభ్యున్నతికి హేతువు. శ్రద్ధ కల కర్మలే సత్కర్మలు.



– గబ్బిట దీప్తి, హైదరాబాద్



# నేరకపోయినది !

సుగుణ, నీలవేణి ఇరుగు పొరుగు స్నేహితులు.

తీరిక వేళల్లో ఒకరింటికి ఒకరు వెళ్లి మాటా మంతితో కాలక్షేపం చేయడం అలవాటుపడ్డారు.

సుగుణ భర్త అభిరాం ప్రభుత్వ ఉద్యోగి. భార్య ఇద్దరు సంతానంతో సంసారాన్ని గుట్టుగా నెట్టుకువచ్చే వ్యక్తి.

సంసారం తీర్చిదిద్దడంలో సుగుణ చాలా చిక్కదనంగా వుండేది.

సుగుణ కల్లాకపటం తెలియని అమాయక త్వంగా వుండేది. నిర్మలమైన మనసుతో ఒకరికి సహాయం చేయాలన్న దృక్పదం కలిగివుంది.

అభిరాం సుగుణకి ఎంతో ఇష్టపడేవాడు. ఒకోపర్యాయం తనుచేసే కొన్ని కొన్ని పనులు నచ్చేవికావు. ఆ సందర్భంలో బాగా చీవాట్లు వినిపించేవాడు.

ఒక పర్యాయం బంధువుల ఇంటికి ఉత్తర ప్రదేశ్ వెళ్లారు. సుగుణ అక్కడ పాల వ్యాపార స్తులు. రకరకాల మిఠాయిలు చేసి అమ్ము కుంటూ రెండు చేతులా డబ్బుగడించడం చూసి ఆశ్చర్య పోయింది.

వదినద్వారా పాలతో ఒకటి రెండు వంట కాలు తెలుసుకుని ఉన్న ఊరు చేరుకున్నారు,

ఉత్తర ప్రదేశ్ విషయాలు చెప్పడానికి సుగుణ నీలవేణి ఇంటికి వెళ్లి మాటల్లో పడింది.

ఆఇంటి పని అమ్మాయి కనకం నీలవేణితో,

ఆరుపల్లి గోవిందరాజులు - సికింద్రాబాద్

"అమ్మగోరూ కాఫీ పెట్టడానికి పాలు విరిగి పోయాయి!" అంది.

నీలవేణి విరిగిపోతే ఏంచేసుకుంటాం వెళ్లి కొత్తప్యాకట్టు పట్టుకొనిరా!" అంది.

సుగుణ ఠక్కున జోక్యం చేసుకొని 'ఆ విరిగిన పాలు నాకిచ్చేయండి" అంది.

నీలవేణి ఖంగుతిని "ఇదేవిటీ విచిత్రంగా మాట్లాడుతున్నావ్? విరిగినవి ఏం చేసుకుంటా వూ ఏమిటి?" అంది.

"ఇచ్చి చూడు విషయం తెలుస్తుంది" అన డంతో ఆ విరిగిన పాలు ఇచ్చి పంపించింది.

సుగుణ ఆనందంతో ఇల్లుచేరి ఓ రుచికర మైన స్వీటుచేసి నీలవేణికి పోరటగా పంపించింది.

మర్నాడు సుగుణ ఇంటికి నీలవేణి వెళ్లి, "అబ్బా! నువ్వు పంపిన స్వీటు ఎంత బాగున్నది అనుకున్నావ్... పిల్లలకే కాదు మా వారికికూడా చాలా ఇష్టపడినారు. ఎలా తయారు చేసావు ఏమిటి?" అనడిగింది.

సుగుణ ఆనందంతో విరిగిన పాలతో ఏ విధంగా స్వీటు తయారుచేసిందీ పూసగుచ్చి నట్టు నీలవేణికి తలకెక్కించింది.

వెంటనే నీలవేణి ఇకపై పాలు విరిగిపోతే నేనే నువ్వు చెప్పిన విధంగా స్వీటు తయారుచేసి మా వాళ్ళకి పెడతాను!" నిర్మొహమాటంగా అంది.

సుగుణ నేరకపోయి చెప్పాను!" అనుకుంది. ఇకమీదట ఏ కొత్తదీ చెప్పకూడదనుకుంది.





ధైర్యవంతుడిలో పిరికితనాన్ని ప్రవేశపెట్టడం కష్టసాధ్యం



# బద్ధకం బద్ధ శత్రువు!

సాంబయ్య, సరోజ దంపతులు. తీర్థయాత్రలకు బయలుదేరారు. చివరికి తిరుపతిలో దర్శనాదులు ముగించుకొని తిరిగి వరంగల్లు చేరుకున్నారు. రైలు రాత్రి రెండు గంటలకు చేరింది. సాంబయ్య భలే బద్ధకస్తుడు. తనే చివరికి నీరసంగా రైలుదిగి బల్లమీద కూచున్నాడు. కానీ సరోజ చాల చురుగ్గా ముందు దిగి సామానులు దింపుకొంది. ఒక కూలీ వచ్చి సాయంపట్టాడు.

సరోజ ఒకసారి ఆ కూలీవాడిని చూచింది. బలంగా వున్నాడు– "ఏమయ్యా ఈ పట్టాలు దాటితే స్కూలు గ్రౌండు. దాని ఆవలే మా ఇల్లు. ఇంటిదాకా రాగలవా?" అన్నది పిదప బేరం కుదిరింది.

ఆ దగ్గర్లోనే వున్న కుళాయి దగ్గర సరోజ ముఖం కడుక్కుని, తుడుచుకుంది, బొట్టు సవరించుకుంది. ముంగురులు సరిచేసుకుంది. ఇక పదమంటూ దారితీసింది. ఆవిడ చకచకా నడచి వెళుతుంటే వున్న మూడు సూటుకేసులు నెత్తి కెత్తుకొని ఆవిడ వెనకాలే కూలీవాడు అనుసరించాడు. సాంబయ్య మాత్రం ఓ బ్యాగును భుజానికి తగిలించుకుని బద్ధకంగా ఒళ్లు విరుచుకొని వారివెనక నడవసాగాడు.

వాళ్లు స్కూలుగ్రౌండులో ప్రవేశించారు. అంతటా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా, భయం కరంగా వున్నది.

"ఏమయ్యా! కొంచెం త్వరత్వరగా నడు!" అన్నది సరోజ. కూలీవాడు నడుస్తూనే వున్నాడు.

వాసాల నరసయ్య

ఐనా ఆవిడ మరలా మరలా కూలీవాడిని త్వర పెట్టసాగింది. వాడు విసిగిపోయాడు.

అతడు, చిరాగ్గా- "ఊర్కోండమ్మా! నడిచే ఎద్దునే పొడిచినట్టుగా వున్నది మీ వరస. నన్నే తరుముతున్నారు. ఏడెనకాలబడిపోయిన మీ నౌకరుగాన్ని ఏమనరా ఏంది?" అన్నాడు.

సరోజ ఖంగుతిన్నది. కోపంగా- "నీకు బుద్ధుందా? అతను నా నౌకరుకాదు. నా భర్త తెలుసా? నోరుమూసుకో!" అంది నెమ్మదిగా.

కూలీవాడు కంగారుగా- "మీరేమో గిట్టుం టిరి, అతనేమో పెరిగిన గడ్డంతో, మాసిన గుడ్డల్తో అచ్చంగా నౌకరులా వున్నాడు. నేనేం చెయ్యను. నా కళ్లకు కనబడింది నా మనసుకు

అంతలోనే ఇల్లు చేరడంతో డబ్బులిచ్చి కూలీని పంపించేసింది సరోజ.

అదిగో! అప్పుడు సాంబయ్య ఇల్లు చేరాడు. "ఏమండి! ఇంట్లో ఎలా వున్నా కనీసం బయట నైన కొంచెం హుషారుగా ఉండండి. తిరుపతిలో నెత్తి, గడ్డం గీయించుకుని బట్టలు మార్చుకొ మ్మని అంటే వినకపోతిరిగదా!" అంటూ విసుక్కుంది సరోజ.

సాంబయ్య అదేం లెక్కచెయ్యలేదు మరి. ఇంట్లోకి దూరి మంచం మీదకు చేరాడు.

ఏదిఏమైనా ఎవరైనా సరే ఎప్పుడైనా మనిషికి విలువ ముందుగా పైకి కనిపించే దాన్నిబట్టి మరి! అందుకు బద్ధకం మన బద్ధ





శీలం కోల్పోవడమంత ప్రమాదం మరొకటి లేదు.



# దెయ్యంలా వదిలింది!

రామాపురంలోని శరభయ్య మహా సోమరి పోతు. కష్టపడి పనిచేయడమంటే అతనికి గిట్టేది కాదు. భార్య సుందరమ్మ తప్ప శరభయ్యకు, నా, అనేవాళ్లెవరూ లేరు. దిక్కుమొక్కులేని శరభయ్యను సుందరమ్మే పోషిస్తున్నది. పెద్దగా ఆస్తి పాస్తులేవీ లేవు. పైగా శరభయ్య బద్ధకస్తుడు కావడంతో కుటుంబభారం ఆమే వహించాల్సి వచ్చింది.

ఏదన్నా పనిచేసి డబ్బు సంపాదించమని భర్తను రోజూ పోరుపెడుతూ వుండేది. అయితే చెవిటివాడి ముందు శంఖం ఊదినట్లుగా అతను మాత్రం యథాప్రకారం కాలక్షేపం చేసేవాడు కాని పనిజోలికి పోయేవాడు కాదు.

అయితే శరభయ్యలో ఒక ప్రత్యేకత వుంది. అదేమిటంటే, అతనికి విపరీతమైన పాటలపిచ్చి వుంది. ఎప్పుడూ ఏవో పాటలు పాడుతూ వుండే వాడు. దానికి తగ్గట్టు అతని గొంతుకూడా మధురంగా వినసొంపుగా వుండేది. అందుకే ఆ ఊళ్లోవాళ్లు అతని పాటలను అడిగి మరీ పాడించుకునేవాళ్ళు.

ఊరివాళ్లు అడిగిందే ఆలస్యం అతను పాటలు మొదలుపెట్టేవాడు. ఎంతకూ ఆపకుండా అలా పాడుతూనే వుండేవాడు.

సుందరమ్మకు మాత్రం చికాకుగా వుండేది. పనీపాటా లేకపోతేసరి అంటూ విసుక్కునేది. ఆమె ఎంత విసుక్కున్నా శరభయ్య గంటల తరబడి పాటలతోనే కాలక్షేపం చేసేవాడే కాని, ఏ పని జోలికి వెళ్లేవాడుకాదు.

ఇలా ఉండగా ఓరోజు శరభయ్య భార్యతో "రోజూ డబ్బు, డబ్బు అని పోరు పెడుతున్నావు

వులాపు బాలకేశవులు - గిద్దలూరు

కదా! పొరుగూరు వెళ్లి నా సంగీత పాండిత్యాన్ని ప్రదర్శించి డబ్బు సంపాదించుకుని వస్తాను!" అంటూ బయలుదేరాడు.

ఉన్న ఊళ్లోనే ఏదో ఒక పనిచేసుకోవచ్చని సుందరమ్మ ఎంత చెప్పినా అతని చెవికెక్కలేదు. పొరుగూరు వెళ్లాలంటే అడవి దాటి వెళ్ళాలి. అడవిలో కొద్దిదూరం వెళ్లగానే చల్లగాలికి హాయిగా నిద్రపోవాలనిపించింది అతనికి

సన్నగా కూనిరాగాలు తీస్తూ ఓ చెట్టుక్రింద నడుం వాల్చాడు శరభయ్య. ఆ చెట్టుమీద ఎప్పటినుండో నివాసముంటున్న ఓ దెయ్యం అతని పాటవిని, "అబ్బ ఎంత చక్కని గొంతు" అనుకుంటూ చెట్టుదిగి వచ్చింది.

"ఇదిగో! నీ పేరేమిటోగాని నీ పాట నాకు చాలానచ్చింది. మళ్లీ పాడు వింటాను!" అని అడిగింది.

ఆ గొంతు వినిపించినవైపుకు చూసిన శరభయ్య దాని ఆకారాన్ని గమనించి, 'అయ్య బాబోయ్ దెయ్యం' అంటూ పరుగు లంకించుకున్నాడు.

దెయ్యం అతనికంటే వేగంగా ముందుకురికి అతని చొక్కా దొరకపుచ్చుకుని, "నేను దెయ్యాన్నే కానీ అపకారిని కాదు. నాకు నీ పాటవినిపించావంటే బంగారు కాసులిస్తాను" అంటూ ఆశ పెట్టింది. దాంతో లొంగిపోయాడు శరభయ్య.

కష్టపడకుండా డబ్బు సంపాదించవచ్చనే అత్యాశతో తన ప్రయాణం సంగతి పక్కనపెట్టి



పాటలు పాడటం ప్రారంభించాడు. చాలాసేపు పాటలు పాడాడు. ఎన్ని పాటలు పాడినా దెయ్యం ఆపమనటంలేదు. ఇంకా ఇంకా పాడమంటూనే వుంది. పాడిపాడి అతనికి నీరసం వచ్చింది. మొదటి సారిగా తన పాట మీద తనకే ఏవగింపు కలిగింది.

కష్టపడి పనిచెయ్యమనే భార్య మాటలు గుర్తు కొచ్చాయి. ఉన్న ఊళ్లో ఏదో ఒక పని చేసు కుంటే ఈ బాధ ఉండేది కాదుగదా! అనిపిం చింది. అతను పాట ఆపడం సహించలేని దెయ్యం "పాడతావా లేదా?" అంటూ వెంట బడింది.

ఎలాగైనా అక్కడనుండి బయటపడకపోతే దాని చేతిలో చావు తథ్యం అనుకుని, బ్రతుకు జీవుడా అనుకుంటూ పిక్కబలం చూపించాడు శరభయ్య.

కొంతదూరం అతన్ని అనుసరించిన దెయ్యం లాభంలేదనుకుని వెనుదిరిగింది.

దెబ్బకు దెయ్యం వదిలిందన్నట్టు శరభయ్యకి పాటలపిచ్చి వదిలిపోయింది. ఆ రోజునుంచి కష్టపడి పనిచెయ్యసాగాడు.

శరభయ్య, భర్త సోమరితనం ఎలా పోయిందో తెలియకపోయినా, దెయ్యంలా వది లింది అని సంతోషించింది సుందరమ్మ.





# శ్రమ విలువ!

కళింగ దేశానికి సామంతరాజైన సూర్య ప్రతాపరాజుకు ఓరోజు ఓ వింత సందేహం స్ఫురించింది. వెనువెంటనే మంత్రి అయిన మాధవయ్యను పిలిపించి– "మహామంత్రీ మన ప్రజలంతా సుభిక్షంగా వుండటానికి కారణం మన సమర్ధవంతమైన పరిపాలనే కదా! మరి అలాంటప్పుడు వారి సంపదపై మనం సుంకం విధించడంలో తప్పేముంది? మనం ఇవ్వని సంపద వారికెక్కడిది? కనుక దానిపై సర్వహక్కులూ మనవే కదా?" అని సున్నితంగా సెలవిచ్చాడు.

మంత్రివర్యుని ముఖకవళికల్ని పరిశీలనగా గమనిస్తూ, రాజుగారి సంభాషణలోని అంతర్లీన భావాన్ని గమనించిన మంత్రి ముభావంగా– "చిత్తం ప్రభూ!" అన్నాడు.

"అయినచో శీఘ్రగతిని మా శాసనం అమలు చేయండి. ప్రజలందరి సంపద మొత్తంలో సగ భాగం రాజావారి ఖజానాకు సుంకంగా చెల్లించమని చాటింపు వేయించండి. సంపద లెక్కలు సరిగ్గా సమర్పించమని, సుంకం ఎగవేతలకు ప్రయత్నించేవారు శిక్షార్హులని కూడా సెలవివ్వండి" అని గంభీరవదనంతో చెప్పి రాజుగారు తన ఆంతరంగిక మందిరానికి వెళ్లిపోయాడు. మంత్రి మాధవయ్య ఆలోచనలో పడ్డాడు. రాజుగారి అభిప్రాయాన్ని అమలుచేస్తే ప్రజా వ్యతిరేకత వచ్చి తిరుగుబాటు రావడం ఖాయం అని తలచాడు.

కానీ ఇప్పుడెలా? రాజుగారి మాట శాసనంగా అమలు చేయకపోతే తన ఉనికికే అతిపెద్ద ముప్పు దాపరిస్తుంది. అలా అని



మరువాడ భానుమూర్తి – హైదరాబాద్

అమలుచేస్తే నిరంకుశ పాలనకు నాంది పలికిన ట్లవుతుంది. ఈ ఆలోచనతోనే రెండ్రోజులు నొప్పింపక తానొవ్వక అనే రీతిలో తప్పించుకుని తిరిగాడు. అతని ఉదాసీనతకు రాజుగారు కోపోద్రిక్తులయ్యారు. మరోసారి మంత్రిగారిని తన ఆంతరంగిక మందిరానికి పిలిపించుకొని "అమాత్యా! మేము మీకు అప్పజెప్పిన కార్య క్రమం ఎంతవరకూ వచ్చింది? ప్రజలు సుంకం చెల్లించుటకు సుముఖులే కదా! మా మాటను అమలు చేయడంలో ఎందుకీ జాప్యం?" అని గట్టిగా అడిగాడు.

అతని మాటలు విని వెంటనే ఏమీ సమా ధానం చెప్పలేక మౌనంవహించాడు మాధ వయ్య అతని మౌనాన్ని ఛేదిస్తూ, "మీ మౌనం అర్థంగీకారమేనని మేము భావించ వచ్చా" అని అన్యాప భావంతో అన్నాడు మంత్రివర్యుని ముఖంవైపు అదోలా చూస్తూ.

చిత్తం ప్రభూ! మీరు ఏమీ అనుకోనంటే నాదో చిన్న విన్నపం. సుంకాల వడ్డింపు సుపరి పాలనగా రాణించదు. ఎందుకంటే దానివలన ఖజానా నిండిపోతుందేమో గానీ! ప్రజలలో రాజుపట్ల విముఖత భావం పెరిగిపోతుంది. మీరు భావిస్తున్నట్లు వారి సంపదకు మూలం మనం కాదు. వారి శ్రమదానమే! అది కష్టార్జితంగా భావించాలి ప్రజలు శ్రామికులై ఉత్పత్తిని వృద్ధిచేసినపుడే దేశం సుసంపన్న మౌతుంది.

సుంకాల పేరుతో వారి శ్రమదానాన్ని దోచుకోవడం సరికాదు. తమ కష్టార్జితాన్ని సుంకంగా చెల్లించి రాజుగారి ఖజానానింపితే మాకొచ్చే లాభమేమిటని? ప్రజలు అనుకుంటే శ్రామికులంతా సోమరులయ్యే ప్రమాద ముంది." అని చల్లగా చెప్పాడు.

మాధవయ్య మాటలు విని ఆలోచనలో పడిపోయిన రాజు తన తప్పు తెలుసుకొని మిన్న కుండిపోయాడు. తన బాధను అర్థంచేసుకున్నం దుకు మాధవయ్య సంతృప్తుడయ్యాడు. ప్రజా కష్టాన్ని సుంకం వడ్డింపులతో దోచుకోనందుకు!



బుజ్జాయి మినీ న్యూస్
BUJJAYI MINI NEWS

సంపుటి : 43 సంచిక : 5
October - 2017 నిర్వహణ : జి. ఎ. రావు

# అక్షర్‌ధామ్ !

మనదేశపు రాజధాని న్యూఢిల్లీలో వంద ఎకరాల స్థలంలో అక్షర్‌ధామ్ నిర్మించబడింది. ఇది భక్తిద్వార్, మరియు మయూర్‌ద్వార్ అనే పెద్ద గేట్ల రక్షణతో ఉంది. అక్షర్‌ధామ్ 141 అడుగుల ఎత్తు 316 అడుగుల వెడల్పుతో, 370 అడుగుల నిడివితో పటిష్ఠంగా నిర్మించబడింది. ఈ స్మారక భవనానికి 145 కిటికీలు, 154 శిఖరాలు ఉన్నాయి. ఇది చూడటానికి ఎంతో మనోహరంగా, అద్భుతంగా కనిపిస్తుంది. ఈ భవనం ఎరుపు రంగు ఇసుకరాళ్ళతో నిర్మించ బడింది. ఈ అక్షర్‌ధామ్‌లో మూల విరాట్ "స్వామి నారాయణ". స్వామి నారాయణకు తల్లిదండ్రులు చేసిన నామకరణం "ఘన శ్యాముడు".



ఘనశ్యామునికి అతిపిన్న వయస్సు నుంచే దైవభక్తి యుండేది. ఇతనికి ఐదు సంవత్సరాల వయస్సులో ఉపనయనం సాంప్రదాయ పద్ధతిలో జరుపబడింది. పంచ శిఖలతో యున్న ఈ బాలుని వదనంలో తేజస్సు కనిపించేది.

పురాణేతిహాసాలతో, శిల్పకళా రూపాలతో పుణ్యస్త్రీలు, పతివ్రతలు, ఋషిపత్నులు, విదుషీమణులు, నర్తకీమణులు లాంటి ఎన్నెన్నో శిల్పాలతో "అక్షర్‌ధామ్"ను ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి నిర్మింపచేసారు. అక్షర్‌ధామ్ దాదాపుగా 20 వేల శిల్పాలు దర్శనమిస్తాయి. ఇక్కడ నారాయణ, గజేంద్ర పీఠాలు, యక్షపురుష కుండం, దశద్వారాలు ఉన్నాయి. అవేకాక ఘనశ్యామ, పరమహంస స్మృతి మండపాలు ఉన్నాయి. భక్తపురుషోత్తమ మండపము కూడా ఉంది. భృగుమహర్షి, ఋష్యశృంగుడు లాంటి ఎందరో మహాపురుషుల్లాంటి తపస్సంపన్నులైన శిల్పాలను దర్శించవచ్చును. పూర్వపు శిల్పకళా సంపద, ఆ వైభవం, గొప్పతనం ఈ అక్షర్‌ధామ్‌లో తిలకించవచ్చు. అక్షర్‌ధామ్ ఆధునికకాలంలో ఈనాటి శిల్పులు శిల్పాలను తయారుచేసినప్పటికి నిర్మాణశైలి, ఆ శిల్పాలు, ప్రాచీన సాంప్రదాయ పద్ధతి లోనే ఉన్నాయి. మన దేశంనుంచే కాక విదేశాల నుంచి కూడా ఎంతోమంది యాత్రికులు న్యూఢిల్లీ లోని



ఉపనయనం తరువాత ఇతనికి "నీలకంఠవర్ణ" అన్న పేరును స్థిరం చేసారు ఇతని తల్లిదండ్రులు. పదకొండు సంవత్సరాల వయస్సులో తల్లిదండ్రుల అనుమతి పొంది నీలకంఠవర్ణి చేతిలో రుద్రాక్షమాలను మాత్రమే తీసుకొని పాదయాత్రకు బయలుదేరాడు.

ఆ పాదయాత్రలో కాశీ, రామేశ్వరం, ఋషికేశ్, హరిద్వార్, కేదార్‌నాథ్, మానస్సరోవరం, పూరిజగన్నాథ్ క్షేత్రాలను దర్శించాడు. ఏడు సంవత్సరాలు ఈ విధంగా పుణ్యక్షేత్రాలను పర్యటించి రామానంద స్వామిని కలుసుకున్నారు. కొంతకాలానికే ఆయనకు ప్రియ శిష్యుడయ్యాడు. రామానంద స్వామి నీలకంఠునికి "స్వామి నారాయణ" అన్న పేరుపెట్టి తన పీఠాన్ని నారాయణకు అప్పగించాడు. ఆ గురువుగారు ఇహ లోక బంధాలను తెంచుకు



పోయే ముందు శైశవ దశనుంచే భక్తి భావాన్ని మనస్సులో నింపుకొని పునీతుడైన ఆ స్వామిని తన 49వ యేట తనువు చాలించాడు.

స్వామి నారాయణ్ శిష్యుడైన ప్రముఖ్‌స్వామి మహారాజ్ పవిత్రమైన సనాతన ధర్మపాలనా క్షేత్రంగా, అక్షర్ ధామ్‌ను దర్శించు కుంటారు. యమునా నదీతీరంలో నిర్మింప బడిన ఈ అక్షర్‌ధామ్ ను ప్రత్యేకంగా నారాయణ్ సరోవరం నిర్మింపబడింది. ఈ సరోవరంలో స్నానం చేసినట్లయితే 151 పుణ్యనదుల్లో స్నానం చేసినంత పుణ్య ఫలితం లభిస్తాయి. అక్షర్ ధామ్ ఢిల్లీలో 24వ జాతీయ రహదారిపై నిర్మింపబడింది. ధామము అంటే ఎన్నో అర్థాలున్నాయి. కాంతిపుంజము, పవిత్రమైన ఆశ్రమము, పవిత్ర స్థలము, దైవ నివాసము, సూర్యుడు అనే అర్థాలు ఉన్నాయి. ఇది ఒక అద్భుతమైన, విశేషమైన దేవాలయ సమూహం. స్వామి నారాయణ్‌ను కన్న తల్లిదండ్రులైన భక్తిమాత, ధర్మదేవుడు ఎంతో ధన్యజీవులు. ఈ అక్షర్‌ధామ్ నిర్మాణానికి కేవలం ఐదు సంవత్సరాల కాలం పట్టింది. 2005వ సంవత్సరం నవంబర్ 6వ తేదీన అప్పటి భారత రాష్ట్రపతి అబ్దుల్ కలామ్, భారత మాజీ ప్రధాని మన్మోహన్ సింగ్ ప్రారంభించారు. ఆనాటినుంచి ఈనాటివరకు ప్రతిరోజు ఎందరో యాత్రికులు అక్షర్‌ధామ్‌ను దర్శించుకొని ఆ భగవంతుని కృపకు పాత్రులౌతున్నారు, ఆధ్యాత్మికతను, దైవభావాన్ని, భక్తిని మనస్సుల్లో నిలుపుకుంటున్నారు. అక్షర్‌ధామ్ ఆలయం పురాతన నిర్మాణ శైలిలో ఉంది. ఆలయం గర్భగుడిలోయున్న స్వామి నారాయణ మూర్తి 11 అడుగుల ఎత్తులో ఉంటుంది. ఈ ఆలయంలో అడుగడుగున శిల్పకళ తాండవిస్తుంది.

– సిరిచందన, హైదరాబాద్



# షీలా పిల్లి మనోవేదన!

**మూ**ర్తిగారి ఇంటి డాబామీద వేపచెట్టు నీడలో షీలాపిల్లి కునుకు తీస్తోంది.

డాబా క్రింద మనుషుల సందడి, అలికిడి ఎక్కువయింది. ఏమిటి చెప్మాఅని కిందకు చూస్తే ఇంటి చుట్టూ కొలతలు, మూర్తిగారితో కొంతమంది రాత కోతలు, వాస్తు వివరాలు మాట్లాడుకుంటున్నారు. షీలాపిల్లి గుండె గుబేల్‌మంది. కారణం, మూర్తిగారి ఇల్లు పడగొట్టి అపార్టుమెంటు కట్టడానికి ప్లాన్ చేస్తున్నారట.

ఆరు సంవత్సరాల కిందట మా అమ్మ నేను చిన్నపిల్లగా వున్నప్పుడు వదిలేస్తే మూర్తిగారి కుటుంబం నన్ను చేరదీసి 'షీల'ని పేరుపెట్టి పాలుపోసి పెంచారు.

ఇప్పటివరకు ఖుషీఖుషీగా రోజులు గడుస్తున్నాయి. పాలబ్బాయి పాలప్యాకెట్లు గుమ్మంముందు వేసిపోతే ఇంటివారు లేటుగా తీస్తే వాటికి రంధ్రంపెట్టి పాలు తాగే చాన్సు, పిల్లి మూతిపెట్టిందని పారబోసే పాలు, విరిగిన పాలు మస్తుగా దొరికేవి. యజమానికి విశ్వాసఘాతం తలపెడుతున్నా నని తెలిసినా ఏంచెయ్యను పుట్టుకతో వచ్చిన అలవాటు.

నా జననం మూర్తిగారింట్లోనే జరిగింది. అమ్మ నన్ను కని వదిలేస్తే నాకు ఇప్పటివరకు



రాధారాణి విఠాల – పూణె

వారింట్లోనే ఆశ్రయం ఇచ్చి పోషించారు. ఇపుడు నా డెలివరి టైముకి వారి ఇంట్లో అటక అనుకూలంగా వుండినా పిల్లలు ఆడుకోవడానికి విశాలంగా వుంటోంది.

మూర్తిగారు పక్కా శాకాహారి అయినా నాకు వారింట్లో తిండికి ఎటువంటి లోటు వుండేది కాదు. అమ్మగారు పూజలు, వ్రతాలు ఎక్కువగా చేస్తారు, పండగలపుడు పాలు వెన్న నెయ్యి పదార్థాలు మస్తుగా దొరుకుతాయి.

వారి ఐదేళ్ళ మనవడికి నేనంటే ఆప్యాయత ఎక్కువ. అందువల్ల నాకు మిల్కు టోస్టులు రిఫ్రెష్ మెంటుగా వేస్తూంటాడు.

మూర్తిగారు ఎక్కువగా పాతసామాన్లు స్టోర్ రూములో నిలువ వుంచుతారు. అందుటవల్ల మూషిక కుటుంబాల సంఖ్య పెరిగి నాకు నాన్‌వెజ్ కూడా లభ్యమవుతోంది.

నేను ఇంట్లోవాళ్లందరికీ ముద్దుగా వుండటానికి కారణం నా బంగారు రంగు శరీరం, ముఖం మీద వంటిమీద తెల్లని మచ్చలుండటమే!

ఇంతకాలం రోజులు హాయిగా గడచి పోయాయి. సడన్‌గా మూర్తిగారు మాత్రం ఇంటిని అపార్టుమెంటుగా కట్టడానికి కాంట్రాక్టు కిచ్చేసారట,

ఇప్పుడున్న పాతఇల్లు పడగొట్టి పునాదులు తవ్వి కన్‌స్ట్రక్సన్ మొదలెడతారట. ఇప్పుడేం చెయ్యడం, మూర్తిగారు ఇంటి సామాన్లు ఎక్కడికి షిఫ్టుచేస్తారో తెలియక తికమకగా వుంది.



# భూలోక వైకుంఠం - శ్రీరంగం!

ఆళ్వార్లు కీర్తించిన నూట ఎనిమిది దివ్య దేశాలలో శ్రీరంగం ప్రధానమైనది. శ్రీరంగమే భూలోక వైకుంఠమని భక్తుల ప్రగాఢ విశ్వాసం. శ్రీరంగం ఉభయ కావేరుల మధ్య అమరిన సుందర ద్వీపం. కావేరి, కొళ్ళిడం అనే రెండు నదులుశ్రీరంగానికి పూలదండలా ఇరువైపులా కొంతదూరం ప్రవహించి తూర్పున కల్లణై వద్ద ఒకటిగా కలుస్తున్నాయి. ఈ క్షేత్రమును చేరుటకు రైలురోడ్డు సదుపాయాలున్నాయి. శ్రీరంగం, తిరుచునాపల్లికి ఎనిమిది కిలోమీటర్ల దూరంలో ఉన్నది.

శ్రీరంగనాథుడు కావేరీ తీరంలో కొలువై ఉన్న వైనాన్ని తెలిపే పురాణగాథలు అనేకం ప్రాచుర్యంలో ఉన్నాయి. వాటిలో చిత్రమైన పురాణగాథ ఒకటి ఇలా ఉంది.

వైవస్వతమనువు కుమారుడు ఇక్ష్వాకు మహారాజు. ఆయన బ్రహ్మనుగూర్చి తపస్సు చేసి మెప్పించగా బ్రహ్మ సంతుష్టి చెంది, తాను నిత్యం ఆరాధించే శ్రీరంగనాథుడుండే విమానాన్ని ప్రసాదించాడు. శ్రీరంగనాథుడు అర్చామూర్తిగా ఇక్ష్వాకుల వంశంలో పూజలందుకుంటూ శ్రీరాముని పూజామందిరానికి వచ్చాడు. శ్రీరామ పట్టాభిషేకానంతరం విభీషణుడు శ్రీరాముని విడిచి లంకకు మరలపోలేక బాధపడుతుండగా రాములవారు ఇక్ష్వాకులపెన్నిధి అయిన శ్రీరంగవిమానమును తమకు మారుగా, చూచుకోమని బహూకరించారు. విభీషణుడు సంతృప్తి చెంది రంగ విమానంతో లంకకు బయలుదేరాడు. మార్గమధ్యంలో మధ్యాహ్నకాల అనుష్టానాలకు కావేరితీరంలో శ్రీరంగ విమానాన్ని వేంపు చేశారు. పూజలు పూర్తి అయిన తరువాత రంగ విమానాన్ని తీసుకుని ప్రయాణాన్ని కొనసాగించుటకు ప్రయత్నిస్తుండగా ఆ విమానం కదలక స్థిరంగా ప్రతిష్టించినట్లుండి పోయింది. విభీషణుడు కలత చెంది శ్రీరంగనాథుని తనతో లంకకు రమ్మని ప్రార్థించారు. అందుకు స్వామివారు ఇకపై తన నివాసం కావేరీ తీరమేనని, అయితే తన దృష్టి మాత్రం దక్షిణ దిక్కువైపు ఉంటుందని, కల్పాంతరంలో మోక్షాన్ని ప్రసాదిస్తానని అభయమిచ్చారు. చేసేది లేక, చింతాక్రాంతుడైన విభీషణాళ్వారు లంకకు మరలారు. ఈ విషయాన్ని విష్ణుభక్తుడైన ధర్మవర్మ తెలుసుకుని శ్రీరంగనాథుని నిత్యం సేవిస్తూ స్వామివారికి చిన్న గుడి కట్టాడు.

ధర్మవర్త కట్టిన గుడి శ్రీరంగ విమానం, కొంతకాలం తరువాత కావేరీనది ఉప్పెనలో కనపడకుండా పోయాయి. కొన్ని సంవత్సరాల తరువాత ధర్మవర్మ వంశజులలో ఒకిరికి ఇసుక మేటలో కూరుకుని పోయి ఉన్న రంగ విమానం కనబడింది. దానిని వెలుపలికి తీసి ఒక శుభ ముహూర్తాన శాస్త్రోక్తంగా మందిరం కట్టి, అందులో స్వామివారిని ప్రతిష్ఠింపజేసాడా రాజు.

శ్రీరంగనాథుని దేవాలయం చాలా ప్రాచీనమయింది. ఈ ఆలయ విశేషాలను 2వ శతాబ్దానికి చెందిన సంగసాహిత్యంలోను, పురాణాలలోను ప్రస్తావించబడింది. ఈనాడు మనం చూసే



- కొమ్మాజోస్యుల కుమార్ రెల్లివలస

ఆలయానికి అంకురార్పణ 7వ శతాబ్దంలో జరిగింది. చోళ, పాండ్య, నాయక రాజులు దేవాలయానికి మరమ్మతులు, విస్తరణలు జరిపారు. ఆలయ పునర్నిర్మాణ కార్యక్రమాల విషయంలో శ్రీకృష్ణదేవరాయల పాత్ర మిక్కిలి ప్రశంసనీయమైనది. ఎన్నోవిలువైన రత్నఖచిత స్వర్ణాభరణాలను స్వామివారికి సమకూర్చారు. కానీ శ్రీరంగ ఆలయ రాజగోపుర నిర్మాణం మాత్రం అసంపూర్ణంగానే మిగిలిపోయింది. సమీపకాలంలో అహోబిల 41వ మఠాధిపతి అయిన అళగియ సింగర్ జీయర్ స్వామి పూనుకొని దాతల విరాళాలతో రాజగోపుర నిర్మాణాన్ని పూర్తి చేసారు. 1987వ సంవత్సరం మార్చి 25వ తేదీన వైభవంగా కుంభాభిషేకం జరిగింది. పదమూడు అంతస్తులు గల ఈ రాజ గోపురం 236 అడుగుల ఎత్తులో ఆసియాఖండంలోనే అత్యంత ఎత్తయిన గోపురంగా గుర్తించబడింది. ఈనూతన రాజగోపురం ఆలయానికి దక్షిణ ద్వారంగా అమరి ఉన్నది.

ఈ ఆలయంలోనున్న పుష్కరిణిలలో ప్రధానమైనది చంద్ర పుష్కరిణి. ఆలయ ప్రాకార ఆవరణలలో నున్న గోపురాలు జీవకళ ఉట్టిపడే శిల్పాలతో ఆలయానికి అంలకారాలై యున్నాయి. దేవాలయానికి ఉన్న సప్త ప్రాకారాలు సప్త లోకాలకు సంకేతాలుగా నున్నాయి. ఈ ప్రాకారాలకు వాటిని కట్టించిన వారి పేర్లు పెట్టారు.

ప్రణవాకార విమానం క్రింద నున్న గర్భాలయంలో శ్రీరంగనాథుడు 5 తలలతో పడగెత్తియున్న ఆదిశేషుని పాన్పుపై శయనించి కుడి చేత్తో తన శిరస్సు చూపిస్తూ అన్ని లోకాలకూ తనే నాధుడునని చెప్తున్నట్టున్నారు. ఎడమ చేతితో పాదాలను చూపుతూ శరణన్న వారిని రక్షిస్తాననిఅభయమిస్తున్నారు. మూలమూర్తికి కొంచెం దిగువున ఉన్న ఒకపీఠంపై ఉత్సవమూర్తి చతుర్భుజుడై ఉన్నారు. వారిని "నంబెరుమాళ్ళు" అని అంటారు.

ఉత్సవమూర్తి పైకుడి చేతితో ప్రయోగ చక్రాన్ని ధరించి యుండగా క్రింది కుడి హస్తం అభయ ముద్రలో ఉంది. శంఖాన్ని పైఎడమ చేతిలోను, క్రింది చేతితో గదను ధరించియున్నారు.

అందమైనచిరునవ్వు మోముతో శోభాయమానంగా దర్శనమిస్తున్నారు.

భక్తులు, వీరిని ముద్దుగా 'అళగియ మణవాళన్' అంటే అందమైన పెండ్లి కుమారుడని పిలుచుకుంటారు.

గర్భాలయానికున్న ప్రదక్షిణ మార్గాన్ని 'తిరువాణ్ణాళి' అని, దానికి ముందున్న మంటపాన్ని రంగ మంటపమనీ, గాయత్రీ మంటపమని వ్యవహరిస్తారు. ఈ మంటపంలో నున్న 24 బంగారు స్తంభములూ, గాయత్రీ మంత్రములో నున్న 24 అక్షరములకు సంకేతాలని పెద్దలు చెప్తారు. వీటిని 'తిరుమణ్ణాత్తూణ్" అని అంటారు. స్వామి వారు ప్రసాదాలు ఆరగించే మంటపానికి చందన మంటపమని పేరు. ఈ దివ్యక్షేత్రం 156 ఎకరాల విస్తీర్ణం కలిగి ఉన్నాది. ఇక్కడ ఉన్నన్ని ప్రాకారాలు, గోపురాలు, మండపాలు, సన్నిధానాలూ మరే దేవాలయంలోనూ లేవు. దేశంలో నున్న అతి పెద్ద దేవాలయాలలో ఒకటిగా దీనిని పేర్కొనవచ్చు.

# మార్పుతెచ్చిన మంచి పని!

రామాపురం ఉన్నత పాఠశాలలో రాము ఏడో తరగతి చదువుతున్నాడు. అందరిలానే రోజూ పాఠశాలకు వస్తాడు. కాని రోజూ అవహేళనల్ని ఎదుర్కొంటుంటాడు. ఎందుకంటే, తనో బుద్ధిమాంధ్యత గల విద్యార్థి. అతడెదుర్కొంటున్న అవహేళనలు తనలో ఆత్మన్యూనతను పెంచాయి. ఇక తను అందరిలా చదువుకోలేననే నిర్ధారణకొచ్చి చదువు మానేయదలచుకున్నాడు.

పాఠశాల ప్రధానోపాధ్యాయులు రామారావు మాస్టారు రామును చాలా రోజులనుండి గమనిస్తున్నారు. అతడిని అవహేళన చేసే విద్యార్థుల్ని చాలాసార్లు మందలించారు. అయినా వారిలో మార్పు రాలేదు. ఏదోకటి చేసి రాములోని ఆత్మన్యూనతను తొలగించాలనుకున్నారాయన.

ఆ రోజు జనవరి ఇరవై ఆరు. పాఠశాలలో గణతంత్ర దినోత్సవ ఏర్పాట్లు ఘనంగా చేయబడ్డాయి. ఉపాధ్యాయులు, విద్యార్థులతోపాటు గ్రామపెద్దలంతా హాజరయ్యారు.

జాతీయ జెండాను ఎగురవేయాల్సిన సమయం రానేవచ్చింది. పాఠశాల వ్యాయామ ఉపాధ్యాయుడు జాతీయ జెండాను ఎగురవెయ్యాల్సిందిగా ప్రధానోపాధ్యాయుల్ని ఆహ్వానించారు.

ఆ సందర్భంగా రామారావు మాష్టారు, "మన జాతీయ జెండాను ఎగురవేసే ఈ బృహత్తర అవకాశాన్ని నేను తీసుకోవడంలేదు. ఈ గొప్ప అవకాశాన్ని ఏడో తరగతి చదువుచున్న మన రాముకి ఇస్తున్నాను." అంటూ అందర్నీ ఆశ్చర్యపరుస్తూ ఆ అవకాశాన్ని రాముకి కల్పించారాయన.

ఆ గొప్ప అవకాశాన్ని రాము అందిపుచ్చుకున్నాడు. జాతీయ జెండాను ఎగురవేసి విద్యార్థులందరి వైపు చూసాడు గర్వంగా. పాఠశాల ప్రాంగణమంతా ఒక్కసారి చప్పట్లతో దద్దరిల్లింది. మాష్టారి చర్య రాములో ఆత్మవిశ్వాసాన్ని నింపితే అతడిని అవహేళన చేసేవారు సిగ్గుతో తలదించుకునేలా చేసింది.





మద్దిల శ్రీనివాసరావు - విజయనగరం



# సహనం !

నారాయణరావు పేట గ్రామములో రామయ్య అనే మోతుబరి రైతు వుండేవాడు. అతడెప్పుడూ చేతిలో దుడ్డుకర్ర పట్టుకుని తిరుగుతుంటాడు. అతనిది శాంతస్వభావమే కాని ఇతరులు తనకు నష్టం చేయకుండా చూసుకునేవాడు. ఎవరి మనసు నొప్పించడు.

అదే ఊరిలో గంగులు అనే దొంగకు అతని సంగతి తెలుసు. అతనింట్లో దొంగతనం చేసినా ప్రమాదమేమీ లేదనుకున్నాడు. అంతకు ముందెన్నోసార్లు దొంగతనాలు చేసి తప్పించుకున్నాడు.

ఓరోజు రాత్రి అందరూ నిద్రలోవున్నారు. గంగులు రామయ్య ఇంటివెనక ప్రహరీగోడ దూకి పెరట్లోకొచ్చాడు. ఇంట్లో నిద్రపోతున్న రామయ్య ఆ శబ్దంవిని బ్యాటరీ లైటుతో పెరట్లో కొచ్చి అటూ ఇటూ చూశాడు. గంగులు కనిపించాడు. ఇదేమిటని గంగులు నడిగాడు. గంగులు నమస్కారంచేసి, "తప్పయిందన్నా, క్షమించు!" మన్నాడు. రామయ్యది జాలిగుండె సరేనని వదిలేసాడు.

గంగులు మరోరోజు రాత్రి కూడా ఇంటి ముందునుంచి గోడదూకి వచ్చాడు. రామయ్యకు మెలకువ వచ్చింది. బయటకొచ్చి గంగుల్ని పట్టుకున్నాడు. గంగులు మరోసారి దీనంగా బతిమాలి లెంపలేసుకున్నాడు. "ఈసారిలాచేస్తే మర్యాదగా వుండదని హెచ్చరించి వదిలేసాడు రామయ్య.

రామయ్య ఇంట్లో డబ్బు, బంగారం వున్నా

కోలపల్లి ఈశ్వర్ - నెల్లూరు

యని గంగులుకు తెలుసు. పట్టువదలకూడదనుకున్నాడు. ఈసారి చాలా జాగ్రత్తగా చెయ్యాలనుకున్నాడు.

ఆరోజు సాయంత్రమైంది. రామయ్య పొలం నుండి రాలేదు, రామయ్య భార్య ఏదో పనిమీద బయటికెళ్లి తిరిగి వచ్చింది. కాపువేసిన గంగులు అలోగా రామయ్య ఇంట్లో చొరబడి ఓ గదిలో దాక్కున్నాడు.

చీకటిపడ్డాక రామయ్య పొలంనుండి వచ్చాడు. భార్యతో కలసి భోంచేసాడు. ఇహ పడుకోవాలనుకున్నాడు. గంగులుకు తుమ్ము వచ్చింది. ఆపుకోలేక తుమ్మేశాడు. రామయ్య దంపతులకు వినబడింది.

వెంటనే రామయ్య కొడవలి అందుకున్నాడు. బ్యాటరీలైటుతో గది లోపలికొచ్చాడు. గంగులును చూసి అతని భార్య బయటకి పరుగెత్తుకెళ్లింది. గంగులు రామయ్య ముక్కుమీద గుద్ది పారిపోవాలని చెయ్యెత్తాడు. రామయ్య ఆ చెయ్యిని గట్టిగా పట్టుకుని బయటకు లాక్కొచ్చాడు. గంగులు బతిమాలడం ప్రారంభించాడు. రామయ్యలో సహనం నశించింది. గంగులు దొంగతనాలు చేస్తున్నాడని అందరికీ తెలుసు. ఈలోగా అతని భార్య వీధివాళ్లను నిద్రలేపి తీసుకొచ్చింది.

ఇంతకుముందు రెండుసార్లు వదిలేసిన సంగతిగూడా చెప్పింది. అందరూ గంగులును శిక్షించి తీరాలన్నారు. గంగులును అందరిమధ్య కూచోబెట్టాడు రామయ్య. కొడవలితో గంగులు ముక్కుకోసి పంపించాడు.

అప్పట్నుంచి గంగులు దొంగతనాలు చెయ్యడం మానేసి రెక్కలకష్టం చేసుకుని బతుకుతున్నాడు.





మంచి సలహాలు స్వీకరించడమంటే శక్తిసామర్థ్యాలను పెంచుకోవడమే

# ఆదర్శనీయం - రామాయణం!

రామాయణము మానవాళికి లభించిన ఒక పరమపవిత్ర కావ్యం. మహర్షి వాల్మీకి రామకథా రచనతో ఆదికవి అయ్యాడు. సాహిత్య క్షేత్రమందు వెలసిన కావ్యాలలో రామాయణము ఆదికావ్యంగా గుర్తింబడింది. రామకథకు ప్రత్యక్ష సాక్షి అయిన వాల్మీకి, రామాయణము రచించాక ఎందరో రామకథా స్మరణతో ధన్యులయ్యారు. వేదవ్యాసుడు అష్టాదశ పురాణాలలోనూ, భారతంలోని అరణ్యపర్వంలోనూ, భాగవతంలో కూడా తనివితీరా రామకథను ప్రస్తావించాడు. ఆధ్యాత్మ రామాయణంకూడా పురాణోక్త రామాయణమే.

"ఈ సృష్టి ఉన్నంతకాలం రామాయణం ఉంటుంది"అని వాల్మీకి రామాయణ అవతారికలోనే బ్రహ్మ వాక్రుచ్చాడు. ఈమాట ఎంత సత్యమో మనకి స్పష్టంగా కనిపిస్తోంది. యుగాల నాటి రామకథ, నిత్యనూతనమై నేటికీ అలరారుతోంది. భారతదేశంలోనే కాక ప్రపంచమంతటా పూజనీయమైంది.

వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణము, సంస్కృత సాహిత్య జగతిలోనే ఎందరో మహాకవుల చేత నాటక కావ్యాలుగా ఆర్ష రామాయణాలుగా వ్యాప్తి చెందింది. కాళిదాసు, భోజుడు, దిఙ్నాగుడు, మురారి, భవభూతి వంటి విశిష్ట సాహితీమూర్తులు, సంస్కృతంలో రామకథను రమ్యంగా అక్షరీకరించారు. భారత దేశంలోనున్న ప్రతిభాషలోనూ, అధిక సంఖ్యలో రామాయణాలు పుట్టాయి. దేవలం అనువాద గ్రంథాలుగా కాకుండా తమ తమ భావనా శక్తినీ, విధానాన్నీ, అందమైన కల్పనలనీ, అపురూపమైన భక్తిగాఢతనూ మేళవించి 'తమ' రామాయణాలుగా తీర్చిదిద్దుకున్నారు. హిందీలో తులసీదాసు 'రామచరితమానస్' ను, తమిళంలో కంబ రామాయణము, తెలుగులో మొల్లరామాయణము, రంగనాథరామాయణము, భాస్కరరామాయణము, వంటివి ప్రసిద్ధి చెందాయి. ఇవిగాక జానపదుల గీతాల్లో, వీధి నాటకాల్లో, హరికథల్లో,బుఱ్ఱకథల్లో రామాయణంలోని పలు ఘట్టాలు శాశ్వతత్వాన్ని పొందాయి. 'రాములోరు' 'సీతమ్మ' 'లక్ష్మణస్వామి' 'హనుమన్న - ఇలా అతి సామాన్యులు సైతం రాముని ఆత్మీయం చేసుకున్నారు. ఊరూరా వాడవాడలా రామమందిరాలు, సీతారాముల పెళ్ళిళ్ళు, పట్టాభిరాముని కొలువులు, దేశమంతటా రామసంస్కృతి వ్యాప్తి చెందింది. రామాయణ గాథ అందరికీ తెలిసినదే అయినా మళ్లీమళ్ళీ ఎన్నిసార్లు చెప్పినా చెప్పించుకున్నా విన్నా విసుగనిపించదు. పురాణ కాలక్షేపాల్లో రామాయణానికున్న ప్రాశస్త్యం మరే కథకూ లేదు. దీనిలో కథకు కథ, నీతికి నీతి, స్వభావ చిత్రణకు, ఆదర్శజీవితానికి ఆదర్శజీవితం, ఇలా అన్నిటికన్నీ సమకూడి ఉన్నాయి.

రామాయణములోని ఒక్క అక్షరాన్ని ఉచ్ఛరించినా మహాపాతకాలు నశిస్తాయి.

రామాయణంలో ఆదర్శవంతమైన మానవధర్మాలున్నాయి. ఆరాధ్యమైన దైవత్వం ఉంది. రామాయణములోని కుటుంబ వ్యవస్థ, పాలనాయంత్రాంగం, పరిపక్వమైన నాగరిక సమాజం యొక్క ఆవిష్కరణ - ఇవన్నీ సర్వమానవ సమాజానికి ఆదర్శాలు.

- డా. అమ్మాజీ, హైదరాబాద్

రామాయణగాథలో నాయకుడు శ్రీరాముడు పరిపూర్ణ మానవుడు ఏ విధంగా ఉండాలో తెలియజేయడానికి మానవుడై అవతరించిన మాధవుడే శ్రీరాముడు. లోకాలకు 'భద్రా' న్ని అనగా క్షేమాన్ని అనుగ్రహించుట చేత రామభద్రుడయ్యాడు. శాంతి, ప్రసన్నత, ఆనందాలను కలుగజేసినందున రామచంద్రుడయ్యాడు. రాముని మేను, నామ వైభవాన్ని - పరాక్రమ, ధైర్య గుణాలనీ కీర్తించి, రామగుణ భజానానందాన్ని పొందాడు త్యాగయ్య. రామదాసు - రాముని "సద్గుణ కల్పవల్లికా రాముడని, "శమ క్షమాది శృంగార గుణాభిరాముడని' కీర్తిస్తూ నూరు పద్యాలు చెప్పాడు. నారదుడు మొదలు వాల్మీకి వరకు ఎందరో ఋషులు, కవులు , వాగ్గేయకారులు, సంకీర్తనాచార్యులు రాముని గుణగానాన్ని నాటి నుండి నేటివరకు చేస్తూ ఉన్నారు. "సత్య నిష్ఠలో రాముడు సాక్షాత్తు ధర్మదేవత అన్నాడు. రూపంలో రాముడు విశ్వమోహన సుందరమూర్తి.

## ఆదర్శపుత్రుడు -

శ్రీరాముడు ఆదర్శపుత్రుడు.

పితృవాక్యపరిపాలకుడు. కులక్రమానుగతమైన చతురంగ బలంతో కూడుకున్న రాజ్యాన్ని ఏలవలసిన వాడు. సవతి తల్లికోరిన వరాలకు బద్ధుడై, వంశప్రతిష్ఠ, తండ్రి దశరథుని సత్యవాక్పరిపాలనకు భంగం వాటిల్లకుండా ఉండానికి రాజభోగాలను, రాజ్యాన్ని తృణప్రాయంగా త్యజించి ఆనందంగా అడవులు పట్టాడు. అటువంటి పుత్రుడు కావాలని ప్రతి తండ్రి కోరుకోవడంలో ఆశ్చర్యం లేదు కదా? యజ్ఞంలో ప్రజాపత్య పురుషుడు దశరథునకు ప్రసాదించిన పాయసంలో ప్రవేశించిన విష్ణుతేజం శ్రీరాముడు. అట్టి శ్రీరాముడు జన్మించిన దినమే శ్రీరామనవమి.

జననం - త్రేతాయుగంలో పునర్వసు నక్షత్ర యుక్తమైన చైత్ర శుద్ధ నవమినాడు సూర్యవంశంలో రఘుమహారాజు కులంలో, కౌసల్య దశరథుల నోముల పంటగా యజ్ఞ సంభవమూర్తిగా శ్రీరాముడు జన్మించినట్లు రామాయణంలో వాల్మీకి మహర్షి అక్షరీకరించాడీ విధంగా -

శ్రీరాముడు అవతరించిన దినమే తరువాత, సీతా రామ కళ్యాణానికి ముహూర్తంకావడం మరో విశేషం. 'రామ' అనే నామంలో 'ర ప్లస్ ఆ ప్లస్ మ' అనే మూడు అక్షరాలు (బీజాక్షరాలు)న్నాయి. 'ర' అగ్నిబీజాన్ని, 'అ' సూర్యబీజాన్ని, 'మ' చంద్రబీజాన్ని తెలియజేస్తున్నాయని మంత్రశాస్త్రం చెబుతోంది. ఈ మూడే విశ్వరచనకు మూలమైన తేజాలు. రాముడు అయోధ్యా వాసులను రంజింపజేస్తే రామనామం ముల్లోకాలను తరింపజేసే తారకమంత్రమైంది.

రామాయణ మహాకావ్యం మానవజాతిని ఉత్తేజ పరుస్తున్న ఇతిహాసం. పవిత్రధర్మ మార్గాలను సూచించు దివ్యరచన.

శ్రీకృష్ణుడు జగద్గురువైతే శ్రీరాముడు జగత్ ప్రభువు. శాంతి సౌభాగ్యాలు వర్ధిల్లాలంటే రామాయణం మనకు పారాయణంకావాలి.



# సాహితీ నిలయం!

దేవతలకు కొంగుబంగారం గజరాజపురం. అక్కడ పదికి మించి ప్రసిద్ధ దేవాలయాలు వున్నాయి. ప్రతి దేవాలయంలోను ధూపదీప నైవేద్యాదులు అనునిత్యం కొనసాగుతూనే వున్నాయి.

అక్కడ శ్రీ షిర్డీ సాయినాధుని దేవాలయం కూడా వుంది. దాని ధర్మకర్త శ్రీనివాసరావు. షిర్డీసాయినాధుని ఆలయంలో దత్తాత్రేయ, అత్రి, అనసూయ, శ్రీగాయత్రీ మాత ఉపాలయాలు కూడా వున్నాయి.

శ్రీనివాసరావు ఆధ్వర్యంలో సాయినాధుని ఆలయానికి రోజురోజుకు ఆదాయం పెరగ సాగింది. దానితో అక్కడ నిత్యాన్నదాన మందిరం వెలసింది. అక్కడ ప్రతిరోజు ఏదో ఒక కార్య క్రమం జరగసాగింది.

"భగవాన్ సూర్య, భక్తప్రహ్లాద, సతీ అనసూయ, షిర్డీసాయి చరిత్ర, శ్రీ గాయత్రీమాత చరిత్ర" వంటి పుణ్యచరిత్రలను హరికథలుగా, బుర్రకథలుగా, నాటకాలుగా, విద్యార్థి చర్చలుగా, విద్యార్థుల వేషధారణలుగా, పాటలుగా మలచి కళాకారులు అక్కడ ప్రదర్శించసాగారు.

గజపురంలోనే శ్రీనివాస దేవాలయం వుంది. దాని ఆదాయంకూడా పుష్కలంగానేవుంది. దాని ధర్మకర్త విశ్వనాధేంద్రరావు. అతను దేవాలయ ఆదాయంలో అధికభాగాన్ని అలంకరణలకు, ప్రచారానికే ఖర్చుపెట్టేవాడు. అన్నదానాదులకు, ప్రసాదాదులకు వెచ్చించవలసిన ఖర్చును కూడా బాగా తగ్గించేసి అలంకరణాదులకు ఖర్చు పెట్టేవాడు.

వాగుమూడి లక్ష్మీరాఘవరావు - కరీంనగర్



దానితో అన్నప్రసాదాదులలో రుచి తగ్గింది. బూజు, పాచి, పురుగులు వంటివి ప్రసాదాదులలో చోటుచేసుకోసాగాయి. ఊరి పెద్దలు ఈ విషయాన్ని గమనించారు. విశ్వనాథేంద్రరావుని ధర్మకర్తగా తొలగించి ఆ బాధ్యతనుకూడా శ్రీనివాసరావుకే అప్పగించారు.

శ్రీనివాసరావు ఆధ్వర్యంలో రెండు దేవాలయాలు దినదినాభివృద్ధి చెందసాగాయి. అక్కడి యజ్ఞ యాగాదుల ప్రభావాన గజరాజపురంలో వాతావరణ కాలుష్యం తగ్గసాగింది.

శ్రీనివాసరావు ధర్మపత్ని శ్రీకళ. భర్తకు తగిన భార్య. వారికిద్దరు సంతానం. వారు సంజన సంజయులు. శ్రీనివాసరావు సంజయ్‌ని ఆదర్శ ధర్మకర్తగా తీర్చిదిద్దాలనుకున్నాడు. దేవాలయ పండితులకు ఆ బాధ్యతను అప్పగించాడు. పండితులందరూ శ్రీనివాసరావు అప్పగించిన బాధ్యతను స్వీకరించారు.

సంజయ్ మనసెప్పుడూ అందమైన సముద్రాల చుట్టూ, అడవుల చుట్టూ తిరిగేది. అక్కడే కవితలల్లుతూ, చిత్రాలు గీస్తూ కాలంగడపాలనుకునేవాడు. సంజయ్ కవిత్వం స్త్రీల చుట్టూ తిరుగుతుండేది. అది గ్రహించిన పండితులు, కవితలల్లటం చాలా గొప్పవిషయం. అయితే కవితావస్తువుగా, స్త్రీని గాక భగవంతుని ఎంచుకో!" అని సంజయ్‌కి సూచనలిచ్చారు.

పండితుల మాటలు సంజయ్‌కి నచ్చలేదు. భగవంతుడనేవాడు సహితం శృంగార పురుషుడే అని సంజయ్ అల్లిన కవితలను చూచి

పండితులు మండిపడ్డారు. సంజయ్‌ని నిలేసారు.

సంజయ్ నాస్తికవాదంతో పండితుల మాటలను తిప్పికొట్టాడు. "ఇదే నాస్తికవాద సహాయంతో అయోధ్యను వదిలిన శ్రీరామచంద్రుని అయోధ్యకు తీసుకురావాలనుకున్నారు కొందరు. అప్పుడు శ్రీరామచంద్రుడు మనిషిని నాస్తికవాదం ఆక్రమిస్తే, "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథిదేవోభవ, అన్న ధర్మాలు మాటలకే పరిమితమవుతాయి. సురాపానం, మధ్యపానం ఒకటేనన్న తత్వం అలవడుతుంది. వావివరసలు తప్పడంలో తప్పు లేదన్న భావన యథార్థం అనిపిస్తుంది" అని పండితులన్నారు. అన్ని విషయాలు శ్రీనివాసరావుకి, శ్రీకళకి చెప్పారు.

ధర్మకర్త శ్రీనివాసరావు చేసేపనులకు మహదానందం పొందిన వస్త్ర వ్యాపారి ధనంజయరావు కుమార్తె భారతి శ్రీనివాసరావు అభిమాని అయ్యింది. శ్రీనివాసరావుకి అనేక కార్యక్రమాల్లో సహాయపడసాగింది. ఆమెకు సంజయ్ గురించి తెలిసింది. సంజయ్‌లోని నాస్తికవాద తత్వాన్ని తొలగించాలనుకుంది. సంజయ్‌తో పరిచయం పెంచుకుంది.

సంజయ్‌కి భారతి మాటలు బాగా ఆకర్షించాయి. భారతిని ప్రేమించాడు. అయితే ఆమె నియమ నిష్ఠలు మాత్రం సంజయ్‌కి తలనొప్పి కలిగించాయి. భారతి కావాలి. కానీ భారతి నియమాలు వద్దన్న స్థితికి సంజయ్ వచ్చాడు. అయితే అందుకు భారతి సమ్మతించలేదు. సంజయ్ మనసు మరల కవితల మీదకు మళ్ళింది.



శ్రీనివాసరావు, శ్రీకళలు సంజయ్‌కి, భారతికి పెళ్లిచేద్దామన్న నిర్ణయానికి వచ్చారు.

సంజయ్ తలిదండ్రులకు చెప్పకుండా ఇల్లు వదిలాడు. అటు తిరిగి, ఇటు తిరిగి కడకు సాహితీ దీవులకు చేరాడు. అదొక అనాగరిక ప్రపంచం. అప్పుడే పుష్పించిన అడవి పువ్వుల్లాంటి ఆడవాళ్లు అతనిని ఆకర్షించారు. రాక్షస ముళ్లులాంటి మగవాళ్ల అతిమర్యాద సంజయ్‌ని ఆకర్షించింది.

సంజయ్ అక్కడే సాహితీ నిలయమనే పర్ణశాలను నిర్మించుకున్నాడు. అక్కడి స్త్రీల అందాలను, ప్రకృతి అందాలను కళ్లార చూచి పులకించి పోయాడు. కవితలల్లాడు. చిత్రాలు గీసాడు. అతని చిత్రాలన్నీ అక్కడివారిని బాగా ఆకర్షించాయి. అక్కడివారందరికీ ఆత్మబంధువు అయ్యాడు. వారిలోని అనాగరికతను తొలగించాడు. వారి మమతానురాగాల్లో మునిగిపోయాడు. ఆ మమతల మందిరంలోని మాధుర్యాన్ని గ్రహించాడు. ఆ మాధుర్యానికి మరో పేరే దైవం అని గ్రహించాడు.

అప్పుడతనికి తండ్రి మాటకు కట్టుబడ్డ శ్రీరామునిలోని ఆదర్శం ఎంత శక్తివంతమైనదో తెలిసింది తలిదండ్రులు గుర్తుకువచ్చారు, భారతి గుర్తుకువచ్చింది. అతని మనసెరిగిన ఆ ద్వీప పెద్ద అతనివద్ద చిరునామా తీసుకుని అతని ఊరు వచ్చాడు. సంజయ్ భారతీల వివాహం సాహితీ నిలయంలోనే జరిగింది.

అక్కడ మరో దేవాలయం వెలసింది.





వృద్ధులనే కాదు వారి అనుభవాన్ని కూడా గౌరవించాలి



# సుందోప సుందుల వధ!

పూర్వం హిరణ్యకసిపుడి వంశంలో నికుంభుడు అనే రాక్షసుడికి సుందుడు, ఉపసుందుడు అనే కొడుకులు వుండేవారు. వారిద్దరికీ ముల్లోకాలను జయించాలనే కోరిక వుండేది. అంతటి ఘనకార్యం ఘోర తపస్సుతో తప్ప సాధ్యం కాదని తలచారు వారు. అన్నదమ్ము లిద్దరూ ఒక కీకారణ్యానికి చేరుకుని తపస్సు ప్రారంభించారు.

మండువేసవిలో పంచాగ్నుల మధ్య నిలచి. వణికించే సీతాకాలంలో జలాశయాల్లో మునిగి ఏళ్ళతరబడి ఘోరతపస్సు చేసారు. వారి తపస్సు తీవ్రతకు ప్రకృతి గతితప్పింది. ముల్లోకాలలో సంక్షోభాలు చెలరేగాయి. ఆ విషమపరిస్థితికి దేవతలు సైతం గజగజ వణికిపోయారు. అలా వారి తపోదీక్ష కొన్నాళ్లు అలా కొనసాగితే ప్రళయం ఏర్పడి మాడి మసైపోతామని భయపడ్డారు.

వారి తపస్సును ఎలాగైనా భగ్నంచేయాలనే పట్టుదలతో చాలా ఆలోచించారు. చివరకు వాళ్లు బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి మొరపెట్టు కున్నారు.

దేవతల గోడు విన్న బ్రహ్మదేవుడు తపస్సు చేసుకుంటున్న సుందోప సుందుల ఎదుట ప్రత్యక్షమయ్యాడు. వారిని ఆయన 'మీకిష్టమొచ్చిన వరాలు కోరుకోండి, అనుగ్రహిస్తాను..' అంటూ వారిని మురిపించాడు. కామరూపం, కామగమనం, ఇష్టసంచారం ఆదిగాగల సకల మాయావిద్యలను అనుగ్రహించాలని, తమకు

భల్లం వెంకట్రాజు - పైడిపర్రు

ఇతరులవల్ల మరణం రాకుండా ఉండేలా వర మివ్వాలని, అమరత్వాన్ని ప్రసాదించాలని కోరుకున్నారు.

అయితే అమరత్వం తప్ప మిగిలిన వరా లన్నింటినీ ప్రసాదించాడు బ్రహ్మదేవుడు.

అసలే వారు రాక్షసులు. ఆపై బ్రహ్మదేవుడి వరప్రభావంతో వారు ముల్లోకాలపై విజృం భించారు. వర గర్వంతో వారు చేసే అకృత్యా లకు సమస్త ప్రజలు తట్టుకోలేక హాహాకారాలు చేస్తున్నారు. మునులు తలపెట్టిన యజ్ఞయాగా దులకు భంగం కలిగిస్తున్నారు. కామరూప విద్యతో క్రూరమృగాల రూపాలు ధరించి, ఊళ్లపై పడి అమాయక ప్రజలను పీడిస్తున్నారు. వారి ఘోర కృత్యాలకు అడ్డులేకపోయింది.

సుందోప సుందులను ఎలా అరికట్టాలో వద్దకు వెళ్లి మొరపెట్టుకున్నారు.

“దేవా!.. నీవిచ్చిన వరాల ప్రభావంతోనే సుందోప సుందులు చెలరేగిపోతున్నారు. లోకులను నానా రకాలుగా నానా రూపాలతో హింసిస్తున్నారు. వారి పీడ విరగడయ్యే పరిష్కారం నువ్వే చూడాలి..” అంటూ తమ గోడు వెళ్లబోసుకున్నారు.

“వారికి నేను అన్ని వరాలూ ఇచ్చానేగాని, అమరత్వాన్ని ప్రసాదించలేదు. నేనిచ్చిన వరం వల్ల ఇతరుల చేతుల్లో వారి మరణం అసంభవం వారిలో వారికే కలహం వచ్చి, పరస్పర యుద్ధా నికి దిగితే తప్ప వారిపీడ విరగడ కావడం సాధ్యంకాదు..” అన్నాడు బ్రహ్మదేవుడు.

ఒకరిపై మరొకరికి అనురాగం గల అన్న దమ్ములు వారు. వాళ్లమధ్య కలహం





ఏంచేయాలో తోచని బ్రహ్మదేవుడు మిగిలిన దేవతలందర్నీ సమావేశ పరచాడు. తానిచ్చిన వరాలవల్ల గర్వాంధులై సుందోప సుందులు ముల్లోకాలనూ ఎలా పీడిస్తున్నదీ వివరించాడు. వారి పీడ విరగడయ్యే ఉపాయం చెప్పమని కోరాడు సభలోని దేవతలను.

విశ్వకర్మ ముందుకువచ్చి "అన్నదమ్ముల మధ్య కలహం పుట్టించడానికి ఆడది చాలు. నేను సృష్టించిన అప్సరస తిలోత్తమ ఆకార్యాన్ని అవలీలగా సాధించగలదు!" అని పలికాడు.

ఆ మాటలతో బ్రహ్మదేవుడికి కాస్త ధైర్యం వచ్చింది. ఇంద్రసభలో వున్న తిలోత్తమకు కబురు పంపాడు బ్రహ్మదేవుడు.

వెంటనే బ్రహ్మదేవుని వర్తమానం అందుకున్న తిలోత్తమ ఆయన ముందుకొచ్చి నిలబడింది.

"నీ అందచందాలతో లోకాలను పీడిస్తున్న సుందోపసుందులను ఆకర్షించి వారిని నీ మోహావేశ సంకెళ్ళతో బంధించు. వారిని కన్నూ మిన్నూ కానకుండా చేసి మైమరపించు. అటు పిమ్మట చాకచక్యంగా వాళ్ళిద్దరి మధ్య కలహం పుట్టించు. కామోద్రేకంతో వారిని రెచ్చగొట్టు తున్నట్లు నటించు.." అని బ్రహ్మదేవుడు తిలోత్త మను ఆదేశించాడు.

ఆ జగదేక అందాల సుందరి తిలోత్తమ భూలోకానికి చేరుకుంది.

సుందోపసుందులకు కనిపించేలా వారు తరచూ సంచరించే ఉద్యానవనంలో తన అంద చందాలతో హావభావాలతో వారి మతిని పోగొట్టేలా నర్తించసాగింది. తమ వయ్యారపు వాలుచూపులతో వారిని కవ్వించసాగింది.

"ప్రాణేశ్వరీ!... నువ్వు నాదానివి.." అంటూ సుందరుడు ఆమె చెయ్యి పట్టుకుని లాగి ఆమెను కౌగలించుకోబోయాడు. అలా పట్టుకున్న ఆ చేతినే "హృదయేశ్వరీ!.." అంటూ ఉపసుందుడు బలంగా లాగుతుంటే ఆమె తప్పించుకో బోయింది. అపుడు వాడు రెండో చేతిని పట్టుకుని లాగాడు. "నన్నే నువ్వు పెళ్ళిచేసుకోవాలి" అని గద్దించాడు.

ఆ తక్షణం వాళ్ళిద్దర్లో ఆమె నాదంటే, నాది.. అనే వాదులాట ప్రారంభమయ్యింది. అంత అనుబంధంతో వున్న అన్నదమ్ముల మధ్య కలహం పుట్టి, ఒకరిపై మరొకరు విరుచుకు పడ్డారు. తమ బలాన్ని తేల్చుకుని ఆమెను పొందాలని యుద్ధానికి సిద్ధమయ్యారు.

ఇదే అదననుకున్న ఆ తిలోత్తమ చిరునవ్వులు చిందిస్తూ... "మీ ఇద్దరికీ నేనొకత్తెనే ఎలా భార్య కాగలను? మీరిద్దర్లో ఎవరు వీరులో వారినే నేను తప్పక పెళ్ళాడతాను!" అని పలికింది.

ఎలాగైనా తిలోత్తమను దక్కించుకోవాలనే ధృడమైన పట్టుదలతో సుందోపసుందులు ద్వంద్వ యుద్ధానికి తలపడ్డారు. ఇద్దరూ సమాన బలవంతులు భీకరంగా పోరాటం సాగించారు. సింహనాదాలు చేస్తూ ఒకరిపై మరొకరు కలబడి ముష్టిఘాతాలతో విజృంభించసాగారు. వారి శరీరాల్లోంచి రక్తం ఏరులై ప్రవహించ సాగింది. వారి అరుపులతో భూనభోంతరాళాలు దద్దరిల్లాయి. చివరకు ఒకరిగుండె మరొకరు చీల్చుకుని దారుణంగా ప్రాణాలు తీసుకున్నారు.

తిలోత్తమ కారణంగా సుందోపసుందుల వధతో లోకం శాంతించింది.





కళ ద్వారానే ఊహ క్రమబద్ధం అవుతుంది

# సమర్థగారి సలహా!



రామయ్య ఒకరోజు ఆశ్రమానికి వెళ్ళి తపస్సులో ఉన్న మహర్షికి తన కష్టాలు చెప్పుకునేవాడు!
నమస్కారం గురుదేవా!
రామయ్యా! నాయనా నువ్వెందుకిలా దిగులుగా ఉన్నావ్- కారణం ఏమిటో?




అది చెప్పడానికే మీ దగ్గరికి వచ్చాను గురుదేవా-
అయితే చెప్పు!




మీకు తెలియనిది ఏముంది గురుదేవా- నేను, నా భార్య, ఎనిమిది మంది పిల్లలు. మేమున్న చిన్న ఇంట్లో ఎలా సుఖంగా బతకగలం మీరే చెప్పండి!




మరి- ఆ ఇంట్లోనే గాలీ, వెలుతురు రావటం లేదా? మీరు సుఖంగా ప్రాణాలు కాపాడుకోవటం లేదా?- ఆ ఇల్లు మీకు సరిపోవాలిగా
ఈ దరిద్రం నుంచి నాకు మీరే పెద్ద ఇల్లు ప్రసాదించండి గురుదేవా..




గురువుగారు ఆలోచించారు...
ఇతనికి ఎంత పెద్ద భవనం ప్రసాదించినా లాభం లేదు- ఉన్నదాంట్లోనే సర్దుకుపోవడం నేర్పించాలి!




రామయ్యా- ఇక మీరు నీ పందిని ఇంట్లోనే ఉంచాలి!
కానీ- గురుదేవా...




చెప్పింది చెయ్. రెండు వారాల తర్వాత కనిపించు!
అలాగే గురుదేవా.


ఒక సారి నసీరుద్దీన్, పరమ పిసినారి, ఆహ్మద్ దగ్గరికి ఉద్యోగం కోసం వెళ్ళాడు!
నసీరుద్దీన్, నేన్నీకు ఉద్యోగం ఇస్తున్నా - కానీ నువ్వు చేసే ప్రతి తప్పుకు ఒక బంగారు దీనారు ను జరిమానాగా కట్టాలి!
పాపం నసీరుద్దీన్ జీతము పది దీనార్లు!
జీతం రోజు రానే వచ్చింది!
కొద్ది రోజుల తర్వాత...
ఇన్ని రోజులు ఏం చేశావ్?
నేను బంగారు దీనార్లు ఇచ్చి పంపింది మా అమ్మకు కానీ నీ అమ్మకు కాదు - ఎంత పొరపాటు చేశావ్?
నన్ను క్షమించండి హుజూర్, నేను తప్పు చేశాను.
మిగిలిన పది బంగారు దీనార్లతో సంతోషంగా తన ఇంటికి వెళ్ళాడు నసీరుద్దీన్!

# విలువైన సేవ!





















సత్యానికి దాని అధికారం దానికుంటుంది




సృష్టిలో ప్రేమను మించిన పవిత్రమైనది ఏది? ఏదీ లేదు.

# ఏకలవ్యుడు

పిల్లలూ! కౌరవులు, పాండవుల గురించి తెలుసు గదా! కౌరవులు ధృతరాష్ట్రుని కొడుకులు. నూరుగురు. పాండవులు పాండురాజు కొడుకులు. వీళ్లు ఐదుగురు. వీరు హస్తినాపురిలో ధృతరాష్ట్రుడి సంరక్షణలో ఉండేవారు. వారికి మంచి గురువును నియమించాలని భీష్ముడు అనుకునేవాడు.

భరద్వాజ ముని కుమారుడు ద్రోణుడు. చాలా పేదవాడు. భార్యను, కొడుకును పోషించలేని స్థితిలో ఉన్నాడు. అప్పుడు పరశురాముడు తన ధనమంతా బ్రాహ్మణులకు దానం చేస్తున్నాడని తెలిసి ఆయన దగ్గరకు వెళ్లాడు. కాని అప్పటికే పరశురాముడు తన ధనమంతా దానం చేసేశాడు. "ద్రోణా! నా దగ్గర ఉన్న ధనం అంతా అయిపోయింది. ఇక నావద్ద నేను నేర్చుకున్న అస్త్ర విద్యలే ఉన్నాయి." అన్నాడు. వాటినే తనకు నేర్పమని వాటిని పరశురాముడి వద్ద ద్రోణుడు అభ్యసించాడు. ఇలా ఉండగా ద్రోణుడి మిత్రుడు ద్రుపదుడు పాంచాల దేశానికి రాజయ్యాడు. వెంటనే ద్రోణుడు ద్రుపదుడి దగ్గరకు వెళ్లి సాయం అర్థించాడు. కాని ద్రుపదుడు ఆయనను అవమానించి పంపేశాడు. దిక్కుతోచని స్థితిలో ఆయన హస్తినాపురం వైపుగా వచ్చాడు. అప్పుడు కురు పాండవ రాకుమారులు ఉద్యానవనంలో బంతి ఆడుకుంటుండగా బంతి బావిలో పడిపోయింది. దాంతో బాటుగా ధర్మరాజు వేలి ఉంగరం కూడా బావిలో పడిపోయింది. దాన్ని చూసిన ద్రోణుడు "రాకుమారులారా! క్షత్రియులై ఉండీ మీరు ఆ బంతిని ఉంగరాన్ని బావిలో నుంచి బయటకు తీయలేక పోతున్నారే"! అని ఒక పుల్లను మంత్రించి బావిలోకి విసిరితే అది బంతికి గుచ్చుకుంది. అలా పుల్లల్ని ఒకదానితో ఒకటి గుచ్చుకుని తాడులా తయారైతే ద్రోణుడు బంతిని, ఉంగరాన్ని బయటకు తీశాడు. ఈ అద్భుతాన్ని రాకుమారులు భీష్ముడికి చెబితే ఆయన ద్రోణుడిని సాదరంగా ఆహ్వానించి రాకుమారులకు గురువుగా నియమించాడు. అప్పటి నుంచి ద్రోణుడు ఆ రాకుమారులకు శస్త్రాస్త్ర విద్యల్ని నేర్పసాగాడు. పాండవ మధ్యముడైన అర్జునుడు ద్రోణుడి ప్రియ శిష్యుడు. గిరిజనులరాజు హిరణ్యధన్వుడు. ఆయన కుమారుడు ఏకలవ్యుడు. అతనికి ద్రోణుడంటే మహా అభిమానం. ఎలాగైనా ఆయన దగ్గర ధనుర్విద్య నేర్చుకోవాలని అనుకున్నాడు. ఒకసారి ద్రోణుడిని కలిసి తనను శిష్యుడిగా చేర్చుకోమని అడిగాడు. కాని ద్రోణుడు తాను కురు పాండవ రాకుమారులకు గురువునని, ఇతరులకు విద్య నేర్పించలేనని అన్నాడు. అయినా ఏకలవ్యుడు బాధపడకుండా ద్రోణుడి పాదాలకు మొక్కి అరణ్యానికి తిరిగి వెళ్లాడు.

ఆనాటి నుంచి ఏకలవ్యుడు ద్రోణుడి విగ్రహం తయారు చేసి ఏకాగ్రతతో ఆ విగ్రహం ముందు నిల్చుని దీక్షగా విలువిద్యను సాధన చేశాడు. రోజూ ఏకలవ్యుడు వేకువజామునే లేచి గురువు విగ్రహానికి పాదాభివందనం చేసి విలువిద్యను సాధన చేసేవాడు. అతను సాధన చేస్తున్నంతసేపు గురువునే మనసులో నిలుపుకునేవాడు. ఒకనాడు కురు పాండవుల రాజకుమారులు



– మహిమ

అడవికి వేటకు వెళ్లారు. వాళ్లు ఏకలవ్యుడు ఉండే ప్రాంతంలోనే ఒక అడవి జంతువును వేటాడాడు. ఆ వేటను చూస్తూ నిల్చున్నాడు ఏకలవ్యుడు. అప్పుడు రాకుమారుల వెంట ఉన్న వేట కుక్క ఏకలవ్యుడిని చూసి మొరగసాగింది. అప్పుడు ఏకలవ్యుడు ఆ కుక్క నోరు మూసేసేలోగానే వరుసగా ఏడు బాణాలు ఆ కుక్క నోట్లోకి సంధించాడు. ఆ కుక్క అలాగే నోటిలోని బాణాలతో రాకుమారుల వద్దకు వెళ్లింది. అమోఘమైన ఆ విలువిద్యా నైపుణ్యానికి రాకుమారులు నిర్ఘాంతపోయారు.

ఆ విలుకాడు అర్జునుడి కంటే గొప్పవాడిలా ఉన్నాడే అనుకున్నారు పాండవులు. ఆయనెవరో వారికి తెలియదు. అడవంతా గాలించారు. చివరకు ఆ బాణాలు సంధించింది ఏకలవ్యుడనే వాడని తెలుసుకున్నారు. "నీ గురువెవరు?" అని అడిగారు పాండవులు. "నా గురుదేవులు ద్రోణాచార్యులవారు" అని చెప్పాడు ఏకలవ్యుడు వినయంగా.

అతను కూడా ద్రోణాచార్యుల వారి శిష్యుడని తెలియగానే పాండవులు ఆశ్చర్యపోయారు.

అయితే ద్రోణాచార్యుడు "అర్జునా! ఏకలవ్యుడికి నేను విద్య నేర్పలేదు" అన్నాడు. కానీ "అతను మీరే తన గురువని చెప్పాడే!" అన్నాడు అర్జునుడు అనుమానంగా.

"ఇదెక్కడి నిందరా బాబూ!" అనుకున్నాడు ద్రోణుడు. ఎందుకంటే ఆయన కౌరవులు, పాండవులకే విలువిద్య నేర్పడానికి నియమించబడ్డాడు. రాజ ప్రాసాదంలో గురువుగా రాజ భోగాలు అనుభవిస్తున్నాడు. ఇప్పుడు వేరెవరికో విలువిద్య నేర్పించి ప్రవీణుడిని చేశాడని ధృతరాష్ట్రుడు, భీష్ముడు అనుకుంటే తనను నమ్మకద్రోహి అనుకుంటారని ఆయన భయపడ్డాడు.

"అలాగా! అర్జునా! అయితే మనం ఏకలవ్యుడి దగ్గరకే వెళ్లి సంగతేంటో తేల్చుకుందాం పద..." అన్నాడు. ద్రోణుడు, అర్జునుడితో కలసి అడవిలో ఏకలవ్యుడి దగ్గరకు వచ్చారు. "ఏకలవ్యా! నేను నీకు విలువిద్య నేర్పలేదే...ఎందుకు నన్ను గురువని చెప్పావు" అని అడిగాడు ద్రోణుడు.

"నేను మీ ప్రతిమను పెట్టుకుని మిమ్మల్నే గురువుగా భావించి విలువిద్య సాధన చేశాను." అన్నాడు భక్తితో ఏకలవ్యుడు. "మరి అయితే ఏకలవ్యా! నాకు గురు దక్షిణ ఇవ్వవా?" అని అడిగాడు.

"ఆజ్ఞాపించండి...గురుదేవా! మీకేం కావాలన్నా ఇస్తాను" అన్నాడు ఏకలవ్యుడు. "అయితే నీ కుడిచేతి బొటనవేలు కోసి నాకివ్వు!" అన్నాడు ద్రోణుడు. కుడి చేతి బొటనవేలు పోతే విలువిద్యా నైపుణ్యం ఉండదు. కేవలం అర్జునుడి కోసం కోరరాని కోరిక కోరి ఏకలవ్యుడికి ద్రోహం చేశాడు ద్రోణుడు. ఏకలవ్యుడు ఏమీ ఆలోచించకుండా తన కుడి చేతి బొటనవేలిని ద్రోణుడికి సమర్పించాడు.

"నిన్ను మించిన విలుకాడు ఉండడానికి వీల్లేదని నేను నీకు చేసిన వాగ్దానం నెరవేర్చుకున్నాను...అర్జునా!" అన్నాడు ద్రోణుడు.

ఇక్కడ మనం గ్రహించాల్సింది ద్రోణుడి ద్రోహబుద్ధికాదు. ఏకలవ్యుడి సాధన, గురుభక్తి, ఏకాగ్రత, త్యాగం. అందుకే ఏకలవ్యుడు చరిత్రలో నిలిచిపోయాడు" అని తెలుసుకోవాలి.

జీవితమనే పట్టుశాలువలో కనిపించని దారంలా నీతి నియమాలుండాలి



# పరివర్తన !

అరణ్యంలో గజరాజు, రాణి ఏనుగు, పిల్లఏనుగులతో ఉల్లాసంగా విహరిస్తూ స్నానానికని నదీతీరానికి చేరుకున్నాయి.

అడవిలో కందమూలాలు రకరకాల ఫలాలు తిని కడుపునింపుకున్నాయి. మస్తీ పెరిగింది. ఆకలిలేకపోయినా ఆటలతో, పరుగులతో గజరాజు, పిల్లఏనుగులు నది ఒడ్డున వున్న రెల్లుగడ్డిని, పూలమొక్కల్ని పీకిపారేస్తున్నాయి. బురదతో నీటిని కాలుష్యం చేస్తున్నాయి.

వాటి కాళ్లక్రింద పడి చిన్నచిన్న జలచరాలు నలిగిపోతున్నాయి. రెల్లుగడ్డి పొదలలో వున్న పిల్లబాతులు, మిగతా పక్షులు హడలిపోయి ఏమీ చేయలేకపోతున్నాయి. కప్పలు గట్టుమీదకు చేరి ప్రాణాలు రక్షించు కుంటున్నాయి. ఈ ఏనుగుల గుంపునుంచి మమ్మల్ని ఎవరు రక్షిస్తారని ఆందోళనలో చెందుతున్నాయి. రోజంతా ఏనుగుల ఆటలు పరుగులతో నది అల్లకల్లోల మైంది.

సాయంకాలమైంది. గజరాజు, రాణి పిల్లలతో సరదా తీర్చుకుంటున్నారు.

ఆ నదిలో నివాసముంటున్న మొసలిపిల్ల, ఏనుగుపిల్లల పాదాలకింద నలిగి చనిపోయింది. నదిలో దూరంగా ఆహారం కోసం వెళ్లిన తల్లిమొసలి తిరిగి స్థావరానికొచ్చి చూడగా నది లో ఏనుగుల భీభత్సం, పిల్ల మొసలి చనిపోయి వుంది.

తల్లిమొసలికి పట్టరాని కోపంవచ్చింది. వెంటనే తన సహచర మొసళ్లకి విషయం చెప్పి గజరాజుకు బుద్ధిచెప్పాలని నిశ్చయించుకుంది.

పెద్దమొసళ్లన్నీ వచ్చి నీటిలో ఆటలాడుతున్న పిల్లఏనుగుల కాళ్లు పట్టుకుని లోపలికి లాగ సాగాయి.

అయోమయం కందర్పమూర్తి - హైదరాబాదు

పిల్లఏనుగుల కాళ్లు మొసళ్ల నోళ్లలో చిక్కుకుని బాధతో అరవడం మొదలెట్టాయి. ఎంత ప్రయత్నించినా అవి పైకిరాలేక పోతున్నాయి.

గజరాజు, రాణి ఏనుగు పిల్లఏనుగులకేమయిందో అర్థంకాక ఆందోళన చెందసాగాయి. పిల్లఏనుగులు అరుపులు ఎక్కువయ్యాయి.

ఇంతలో తల్లిమొసలి రాణిఏనుగు దగ్గరకొచ్చి "నీకంత కండకావరమా? నదినీటిలో ప్రశాంతంగా నివసిస్తున్న మా జీవితాల్ని నాశనం చేస్తావా! చూడు, మీ ఆనందంకోసం ఎన్ని పక్షులు, జంతువులు ఆందోళన చెందుతున్నాయో, మీ పిల్లఏనుగుల కాళ్లకింద నలిగి నా పిల్లమొసలి చనిపోయింది. అందుకు బదులుగా నీ పిల్లలను నీటిలోకి లాగితే ఊపిరాడక చస్తాయి. అప్పుడు నీకు గర్భశోకం ఎలా వుంటుందో తెలుస్తుంది. అడవిలో అన్నీ తిని మదమెక్కి ఇలా విధ్వంసం సృష్టించారు మీకు గుణపాఠం తప్పదు!" కోపంగా చెప్పింది.

పిల్లఏనుగుల రోదనలతో తల్లడిల్లిన రాణి ఏనుగు, గజరాజు పశ్చాత్తాపంచెంది "మా ఆనందం కోసం ఇంత వినాశనమైనందుకు బాధపడుతున్నాము. మమ్మల్ని మన్నించు. మరెప్పుడు ఈ ప్రాంతానికి రాము. మా పిల్లల ప్రాణాలు కాపాడ"మని వేడుకున్నాయి.

"నేను తల్లిని కాబట్టి గర్భశోకం తెలుసు, మీరు తప్పులు తెలుసుకున్నారు కాబట్టి మీ పిల్లఏనుగులను ప్రాణాలతో వదిలిపెడుతున్నా" అని చెప్పి తన తోటి మొసళ్లను అర్థించి వదిలిపెట్టింది.

మొసళ్ల నోళ్లలో నలిగి రక్తపుపాదాలతో బ్రతుకుజీవుడా అంటూ ఒడ్డుకు చేరాయి. ప్రాణాలతో బయటపడ్డ తమ పిల్లల్ని చూసి పెద్దఏనుగులు ఆనందించి వాటిని వెంట తీసుకుని అడవిలోకెళ్లాయి.

మన ఆనందం కోసం ఇతరుల్ని బాధపెట్టడం సబబుకాదని తెలుసుకున్నాయి.



తత్వశాస్త్రం హేతువుకు సంబంధించిన రహస్యాలను గుర్తిస్తుంది.



# ధర్మవ్యాధుడి ధర్మనిరతి...!

అరణ్యవాసంలో వున్న సదాచార సంపన్నులు పాండవులు కొన్నాళ్ళు చిరంజీవి అయిన మార్కండేయ మహర్షిని సేవిస్తూ కొంతకాలం కాలక్షేపం చేసారు. ఆ మునిపుంగవుడు ధర్మ సూక్ష్మాలను వివరిస్తూ కథలు చెప్పేవాడు. కుల ప్రాధాన్యాన్ని మించినది గుణప్రాధాన్యమేనని వివరిస్తూ మార్కండేయ మహర్షి పాండునందనులకు ఈ కథ చెప్పాడు.

ఒక నదీతీరంలో వున్న కుగ్రామంలో ఒక విప్రుడు వుండేవాడు. ఆ గ్రామానికి చేరువలోనే ప్రశాంతమైన ఒక వనం వుండేది. సదాచార పరాయణుడైన ఆ విప్రుడు రోజూ నదిలో స్నాన సంధ్యలు కావించుకుని సమీపంలోని ఆ వనంలో ఒక చెట్టుకింద తపస్సు చేసుకునేవాడు. మధ్యాహ్నవేళకు ఆ గ్రామంలో భిక్షాటన చేసుకుంటూ దొరికేది తింటూ కాలం గడిపేవాడు.

ఒకనాడు ఆ విప్రుడు చెట్టుకింద ధ్యానం ముగించుకుని మధ్యహ్న భిక్షకోసం బయల్దేరడానికి సిద్ధపడుతూ వుండగా చెట్టుమీద వాలిన కొంగ ఆయనపై రెట్టవేసింది. క్రోధానికి గురైన ఆ విప్రుడు తల పైకెత్తి కొంగవైపు తీక్షణంగా చూసాడు. ఆయన చూపుకు ఆ కొంగ అక్కడికక్కడే మాడి మసైపోయింది. అలా కొంగ మాడి మసైపోవడంతో 'ఓహో! నాకు తపశ్శక్తి సిద్ధించిందన్నమాట' అని అనుకున్నాడు ఆ విప్రుడు. యథాప్రకారం భిక్షాటనకు గ్రామంలోకి బయలుదేరాడు.

ఒక ఇంటిముందు నిలిచి "భవతి భిక్షాం దేహి..." అన్నాడు. ఆ మాటవిని ఇంట్లోని ఇల్లాలు అతడికి భిక్ష తేవడానికి వంటింట్లోకి వెళ్లింది. అదే సమయానికి ఆమె భర్త ఇంటికి వచ్చాడు. ఆమె అతడికి కాళ్లు కడుక్కొనుటకు



కంఠస్ఫూర్తి అన్నపూర్ణ - పైడిపర్రు

నీళ్ళిచ్చి, అతడికి భోజనం వడ్డించి సపర్యలు చేయసాగింది. భర్త అలసివచ్చినందుకు తొందరగా నిద్రలోకి జారుకున్నాడు.

అప్పటివరకు ఆమె గుమ్మం ముందు నిలబడివున్న ఆ విప్రుడికి భిక్షతీసుకువచ్చింది. అంతసేపు తనను నిరీక్షింపజేసిన ఆ గృహిణిపై విప్రుడికి విపరీతమైన కోపం వచ్చింది. ఆమె వైపు తీక్షణంగా చూసాడు.

అప్పుడామె చిరునవ్వుతో.. "స్వామీ! మీ కోపానికి మాడిమసైపోయేందుకు నేనేమీ చెట్టు మీద కొంగను కాదు" అని పలికింది. ఆమె మాటలకు విప్రుడు దిగ్భ్రాంతుడయ్యాడు. "అమ్మా! ఎక్కడో అడవిలో జరిగిన సంఘటన నీకెలాతెలిసింది?" అంటూ ఆశ్చర్యంతో అడిగాడు. నీవు మహాజ్ఞానివై వుంటావు. నాకు జ్ఞానబోధచేయు తల్లీ.." అని అర్థించాడు.

"మునీశ్వరా! నేను నీకు జ్ఞానబోధచేసేటంత మహిమగలిగినదాన్ని కాదు. మిథిలానగరంలో ధర్మవ్యాధుడనే కిరాతుడు మాంస విక్రయంతో జీవనం సాగిస్తున్నాడు. అతడు మీకు ధర్మసూక్ష్మాలన్నీ బోధించగలడు" అని జవాబిచ్చింది.

ఆమె మాటమేరకు ఆ విప్రుడు మిథిలా నగరానికి చేరుకున్నాడు. నగర వాసులను అడిగి తెలుసుకుని, ధర్మవ్యాధుడి ఇంటికి వెళ్లాడు. అతని ఇంటికి ముందు జంతు కళేబరాలు కనిపించడంతో సంకోచించి, గుమ్మానికి దూరంగానే నిలిచిపోయాడు. విప్రుడిని గమనించిన ధర్మవ్యాధుడు బయటికి వచ్చి అతడికి నమస్కరించాడు. "మిమ్మల్ని నా వద్దకు పంపిన సాధ్వీమణి కుశలమేకదా?" అని ప్రశ్నించాడు.



ఆ మాటకు విప్రుడికి మతిపోయింది. అక్కడ గ్రామంలో ఆ ఇల్లాలు అడవిలో జరిగిన కొంగ వృత్తాంతాన్ని చెప్పింది. ఇక్కడ ఈ ధర్మవ్యాదుడు ఆ పతివ్రత యోగక్షేమాలను అడుగుతున్నాడు. వీళ్లిద్దరికీ ఇంతటి కాలజ్ఞానం ఎలా అబ్బి వుంటుందని ఆలోచించసాగాడు.

ధర్మవ్యాధుడు విప్రుడిని సాదరంగా తన ఇంటికి ఆహ్వానించాడు. అతనింట్లో వార్థక్యంతో మంచం మీదనుంచి లేవలేని స్థితిలో వున్నారు ధర్మవ్యాధుడి తల్లిదండ్రులు. ధర్మవ్యాధుడు ఆ విప్రుడిని ఒక ఆసనంపై కూర్చుండబెట్టాడు. అతని ముందే తన తలిదండ్రులకు పరిచర్యలు చేశాడు. తర్వాత విప్రుడివద్దకు వచ్చి కూర్చుని, "స్వామీ! నేను చేసేది ఇదే. జన్మనిచ్చిన తల్లి దండ్రులను నిత్యం సేవిస్తూ వుంటాను. ఇక ఆలుబిడ్డల పోషణ కోసం నావృత్తి నేను చేసు

విప్రుడు ఆశ్చర్యంతో అతడివైపు చూశాడు.

ప్రాణాలు నిలుపుకోవడానికి కావల్సిన ఆహారంకోసం చేసేది జీవహింసకాదు. వ్యాపారంలో దొంగతూకాలు, అధిక లాభాలూ నేనెప్పుడూ ఎరగను. అసత్యమాడను నామీద ఆధారపడ్డవారి యోగక్షేమాలు చూసుకుంటాను. స్వధర్మాన్ని వీడకుండా పరోపకారాన్ని చేయుటకు మించిన ధర్మమేముంది? అనిత్యమైన మానవ జీవితాన్ని సార్థకంచేసుకుంటూ మనుగడ సాగించేవాడే ధన్యజీవి. నేను మీ అంతటి తపస్సంపన్నుడను కానుగదా! నా ధర్మనిరతే, నన్ను కాపాడుతోంది. ధర్మం పరబ్రహ్మ రూపాంశం అని మీరూ ఎరుగుదురు" అన్నాడు ధర్మవ్యాధుడు.

ధర్మవ్యాధుడి బోధతో ఆ విప్రుడికి జ్ఞానోదయ మయ్యింది. అతడు ప్రశాంత





సత్పురుషులు అణకువ కలిగి ఔన్నత్యం పొందుతారు



అంటార్కిటికాలో అమూల్య వస్తు సందర్శన నిమిత్తం ఓడలో ఒక బృందం బయలుదేరింది. ఆ బృందంలోని ఒక వ్యక్తికి సంబంధించినవాడు అమృత వందిత్. అతనికి ఓడలో క్షీర సాగరంలో పయనించాలన్న వాంఛ బలంగా వుంది. అందునిమిత్తం సాగర శాస్త్రాన్ని, పురాణాలను క్షుణ్ణంగా అభ్యసించాడు. ఒకనాడు అభ్యసించిన విషయాలను మననం చేసుకుంటూ అమృతవందిత్ పడుకున్నాడు.

అది అందమైన క్షీరసాగరం. క్షీరపు అలలు ఎగిసిపడుతున్నాయి. ఆ సముద్రము కామధేనువు రూపంలో వుంది. అందులో శ్వేతనాగులు సంచరిస్తున్నాయి. శ్వేత మీనకన్యలు ఆనంద నాట్యం చేస్తున్నారు. అలాంటి సముద్రంలో సోనాంటిక్ ఓడ ప్రయాణమైంది. అందులో అమృతవందిత్ వున్నాడు. అతనితో పాటు అతని తలిదండ్రులు, బంధువులు వున్నారు. వారితో పాటు సిరికళ తలిదండ్రులు కూడా వున్నారు.

వారందరి దృష్టి ఆ ఓడలో వున్న సంస్కృత కవులమీద పడింది. మహాకవి కాళిదాసు సిరికళ, అమృతవందిత్‌లను చూచి, "ఈ జంటను చూడటానికి రెండు కళ్లు చాలటం లేదు. సిరికళను చూస్తుంటే నా కుమార సంభవంలోని పార్వతీదేవి జ్ఞప్తికి వస్తుంది" అని అన్నాడు.

కాళిదాసు మాటలను  న్న భవభూతి, బాసుడు, శ్రీహర్షుడు, కల్హణుడు, జయదేవుడు, మాఘుడు, జగన్నాథ పండితరాయలు" నిక్కము వక్కాణించితివి కాళిదాస మహాకవి అని అన్నారు.

వాగుమూడి లక్ష్మీరాఘవరావు – కరీంనగర్

"నిగనిగలాడే నల్లని కురులతో సిరికళ మనో హరంగా వుంది. అడవి ధాన్యాలను గుప్పిళ్ళతో శకుంతలాదులు కదలాడారు.

భవభూచి మాటల్లో సీతామాత, మాలతీ మొదలైనవారు కదలాడారు. బాసుని మాటల్లో వాసవదత్త, పద్మావతి మొదలైనవారు కదలాడారు. శ్రీహర్షుని మాటల్లో దమయంతి కదలాడింది. కల్హణుని మాటల్లో శివుని అర్థనారీశ్వర స్వరూపం కదలాడింది. జయదేవుని మాటల్లో రాధ కదలాడింది. మాఘుని మాటల్లో రుక్మిణీ సత్యల రాచరిక విలాసం కదలాడింది. జగన్నాథ పండితరాయల మాటల్లో లవంగి కదలాడింది. కడకు అందరి మాటల్లో సిరికళ అందం కదలాడింది.

అమృతవందిత్ సిరికళను తొలిసారిగ ఓడలోనే చూసాడు. అతని దృష్టిలో సిరికళ క్షీరసాగర మధనంనుండి జన్మించిన శ్రీలక్ష్మిలా వుంది. క్షీరసాగరంలో అమృతవందిత్ శ్వేత మీన కన్యలను చూసాడు. వారి వయ్యారాలను చూసాడు. అతని ప్రేమని అతని పెద్దలు అంగీకరించారు. అయితే సిరికళ తలిదండ్రులు అమృతవందిత్ ప్రేమను అంగీకరించలేదు.

సిరికళ ప్రేమ బీజదశలో వుందని సంస్కృత కవులు గమనించారు. అంత సిరికళ వద్ద అమృతవందిత్ గుణాలను చక్కగా వర్ణించి చెప్పారు. సిరికళ ఆలోచనల్లో మార్పురాసాగింది. ఆమె తలిదండ్రులు ఆమె మార్పుని అనుక్షణం ప్రతిఘటించారు. అయితే కడకు సంస్కృత కవులే గెలిచారు.

సిరికళ మనసు మారింది. అమృతవందిత్‌ని తప్ప మరొకరిని మనువాడనని తలిదండ్రులకు చెప్పింది. సంస్కృత కవుల ప్రభావంతో ఆమె తలిదండ్రులు కూడా మారారు.

సిరికళ అమృతవందిత్‌ల పరిణయం జరిగింది. అమృతవందిత్ సంస్కృత కవులకు తలొక అగ్రహారాన్ని రాసిచ్చాడు.

కల చెదిరింది. అమృతవందిత్ కలని తలచుకుని హాయిగా నవ్వుకున్నాడు.



Edited & Published by G.A. Rao at 21/3, Rajabather Street, T.Nagar, Chennai-17, Phone - 28152043, 28150423
Printed at Sakthi Precess, Chennai - 81 for Ramanjaneya Press, Rajahmundry



హోటల్ శ్రీ గ్రాండ్స్

# Hotel Sri Grands

*Most Spacious*

## SERVICES

- Round-the clock Room Service
- Provision for Extra Person / Bed
- Sri Tara Veg. Restaurant Attached
- Purified Drinking Water
- Toursit Cars and Vans on Hire
- Laundry
- Wi-Fi Internet
- Captive Power Supply
- 24-hour Check-In Check-Out









# 87-1-13/1 Opp. RTC Bus Stand, Rajahmundry - 533 103. A.P.
Ph: 0883-2468977, Cell: 8099664555 hotelsrigrands@gmail.com

